# సంక్రాంతి పండుగకు 'ఉమా' నగల శోభ!

అందము, ఆనందముకొరకు ప్రఖ్యాత "ఉమా" బ్రాండు బంగారు కవరింగు నగలనే కొనండి. బంగారు కవరింగు "ఉమా" లాకెటు చైన్లను స్త్రీ, పురుషులకు, బాల, బాలికలకు ఉపయోగించుకొనండి. అనేక సంవత్సరములు మన్నిక యుండి తృప్తి నిచ్చును.

సామాన్య వి. పి. పార్సెలు చార్జీ రు. 1-37

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

హెడ్డాఫీసు: ఉమామహల్, మచిలీపట్టణము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోష్టాఫీసు




మా విక్రయ శాలలు:

90 - చైనాబజారు రోడ్డు, మద్రాసు - 1

581 - శివాలయం వీధి, విజయవాడ

104 - అవెన్యూ రోడ్డు, బెంగళూరు సిటి

క్యాటలాగుకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు హెడ్డాఫీసుకు మాత్రము.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# సూపర్ ఫాస్ఫేటు

అంటే మీయొక్క భూములనుండి

## అధిక పంటను

## అధిక తరము

## అధిక ఆదాయము

అమోఘమైన
ఉత్పత్తిని యిచ్చునది



సందేహించకండి— సూపర్ ఫాస్ఫేటు ఉపయోగించండి

సదరన్ రీజయనల్ కమిటి
ఫెర్టిలైజర్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా P.B. No. 12, మద్రాసు—1.

# పాఠకుల లేఖలు

## జనవరి 1962

“చందమామ” అనుకోనంత ముచ్చటగా ముస్తాబయి, అల్లు ళ్ళందరిని సంతోషాంబుధిలో ముంచేస్తున్నందుకు నా ధన్యవాదాలు.

—మామిడూరు శంకరశాస్త్రి, పెరవలి

ప్రపంచపు వింతలు ప్రచురించుచున్నందుకు చాల సంతోషం.

—కాసం యాదగిరి, జనగామ

ఈ నెల [డిసెంబరు] ‘చందమామ’లో “కష్టార్జితం” [గుండుభీమన్న కథ] చాలా బాగుంది.

—పి. కిష్టయ్యా, వేములవాడ

గుండుభీమన్న కథ చదువుచున్నంత వరకూ కడుపు చెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. ఇంతకీ వాడి తెలివేం తెలివండి—అద్భుతం! అమోఘమైన బుర్ర! భీమన్న, షావు కారిచ్చిన పావలా తిన్నగా యింటికి పట్టుకెళ్ళాడో లేదో నా కనుమానంగా వుంది!

—నందం సోమరాజు, మలికిపురం

[ఆ పావలాతో ఇంటికి పోతే వాడు గుండుభీమన్నే కాడు!—సం.]

మా యింట్లో-మా కందరకు రెండే ప్రియమైన వస్తువులు. ఒకటి మా చిట్టిపాపాయి, రెండు “చందమామ.”

—షమిడి సావిత్రీదేవి, ఒంగోలు

"పులి - గాడిద", "సువర్ణలోభి", "రాకాసి లోయ" చాలా బాగున్నవి.

—వజ్రాల రామలింగం, తెనాలి

"దుష్కర్మ ఫలితం" కథ అద్భుతంగా వుంది. "కష్టార్జితం" కథ కమనీయంగా వుంది.

—నల్లా దత్తాత్రేయులు, మోరి

ఈ నెల గుండుభీమన్న కథ యెన్ని సార్లు చదివినా తనివితీరటం లేదు.

—యం. మంగయ్య, తిరువూరు

"దుష్కర్మ ఫలితం" [బేతాళ కథ], "సువర్ణ లోభి", "సజ్జనుడి పాట్లు" ముఖ్యముగ చెప్ప దగినది. "రాకాసిలోయ" "చందమామ"కు వన్నె తెచ్చింది.

—గొబ్బూరు విజయకుమారు శర్మ, గిద్దలూరు

"భారతచరిత్ర" చదివితే ఇంక మేము సోషల్ పుస్తకము చదవ నవసరం లేకుండా వుంది.

—అల్లాడి వెంకటరమణ, నెల్లూరు

"చందమామ" రోజురోజుకు పాఠకుల పాలిటి పాలవెల్లి అవుతున్నదంటే ఆ ఘనత కేవలం మీ పత్రికకు అంద చందాలు తీర్చే కళాకారులకే చెందవలసి వున్నది.

—పి. రంగారావు, యాదవోలు

'కష్టార్జితం', "పులి—గాడిద" చదువుచుంటే కడు పుబ్బ నవ్వొస్తోంది. "సువర్ణలోభి" చాలా బాగుంది.

—వారణాసి సూర్యారావు, మీనవిల్లూరు

"దక్షయజ్ఞము" ఎంతో బాగుంది. వడ్డాది పాపయ్యగారి చిత్రలేఖనం కూడా చూడ ముచ్చట గానూ, ఆకర్షణీయంగానూ వుంది. కవి చిత్ర లేఖకుల కిద్దరకు నా ధన్యవాదాలు.

అరవపల్లి రమాకుమార్, టంగుటూరు


TR


ష్, గొడవ
చేయవద్దు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి గేయ కథలు పాఠకులను అపారంగా ఆకర్షించి ఆనందం చేకూర్చటమేగాక, వాటిని కొన్ని పాఠశాలలలో గేయ ప్రదర్శనాలకూ, నృత్య ప్రదర్శనాలకూ కూడా వినియోగిస్తున్నారని తెలపటానికి చాలా ఆనందంగా ఉంది. శ్రీ ఆచార్యగారి కొత్త గేయకథ "పార్వతీ కల్యాణం" ఈ సంచికలో ఆరంభమవుతున్నది.

అన్నిటికన్న యువక పాఠకులకు ఉత్సాహాన్నీ, మనోల్లాసాన్నీ కలిగిస్తున్నది, బొమ్మల సీరియల్ "రాకాసి లోయ." ఈ కథ తమలో కలిగించే ఆనంద పారవశ్యాన్ని ఎందరో పాఠకులు లేఖలద్వారా తెలియజేస్తున్నారు. వారందరికీ కృతజ్ఞులం.

సంపుటి 30 : జనవరి 1962 : సంచిక 1

CHITRA



# భారత చరిత్ర



క్రమంగా భరతఖండంలో ఆర్యసమాజాలు విస్తరించి, మార్పులు పొందాయి. అక్కడక్కడా రాజరికం లేని గణతంత్ర రాజ్యాలు చిన్నవి ఉన్నప్పటికీ, రాజరికానిదే పై చేయి అయింది. రాజ్యాలు విస్తరించి సామ్రాజ్యాలయాయి. ఇలాటి సామ్రాజ్యాలు నాలుగు—అవంతీ, వత్స, కోసల, మగధ- ప్రసిద్ధి కెక్కాయి.

అవంతికి ఉజ్జయిని రాజధాని. ఇది ఇప్పుడు మాల్వదేశంలో ఉన్నది. వత్స దేశానికి రాజధాని అయిన కౌశాంబి అలహాబాదు సమీపంలో ఉండేది. ఉజ్జయిని రాజైన ప్రద్యోతుడి కుమార్తె వాసవదత్తను వత్స రాజైన ఉదయనుడు ఎత్తుకుపోయి పెళ్ళాడిన కథను మనం లోగడ చదివి ఉన్నాం. కోసల సామ్రాజ్యానికి అయోధ్య రాజధాని. మగధ ఈనాటి బీహారు దక్షిణ ప్రాంతం. వేదకాలంలోనే మగధను బలాఢ్యులు పాలించారు. క్రీస్తు పూర్వం 6 వ శతాబ్దంలో బింబిసారుడనే వాడు రాజ్యాభిషిక్తుడై తన సామ్రాజ్యాన్ని బాగా విస్తరించాడు. ఇతను బుద్ధుడి సమకాలికుడు. బుద్ధుడు పరినిర్వాణం పొందటానికి 60 ఏళ్ళ పూర్వం తన 15 వ ఏట సింహాసనం ఎక్కాడట. (బుద్ధుడి పరినిర్వాణం క్రీ. పూ. 483 లో జరిగినట్టు అంచనా.)

బింబిసారుడు అంగ దేశాన్ని (తూర్పు బీహారును) జయించాడు. కోసల, వైశాలీ రాజకుమార్తెలను పెళ్ళాడాడు. తన రాజధాని గిరివ్రజం అయినప్పటికీ రాజగృహం అనే మరొక నగరం నిర్మించాడు. వర్ధమాన మహావీరుడు జైన మతాన్నీ, గౌతమ బుద్ధుడు బౌద్ధ మతాన్నీ బింబిసారుడి కాలంలోనే ప్రచారం చేశారు. బింబిసారుణ్ణి వృద్ధాప్యంలో అతడి కొడుకు అజాతశత్రువు హత్య చేశాడని ప్రతీతి.

## 4. మగధ సామ్రాజ్యం



అజాతశత్రువు రాజ్యానికి వస్తూనే శత్రు బాధ ఎదుర్కొన్నాడు. కాని దక్షులైన మంత్రులుండి అతనికి విజయం చేకూర్చి పెట్టారు. వీరి కృషివల్లనే, గంగా శోణా నదుల సంగమం వద్ద ఉండిన పాటలీ గ్రామం శత్రు నిర్భేద్యమైన కోటగా నిర్మించబడి, పాటలీపుత్ర మనే పేరు సంపాదించి భరతఖండ మంతటికీ మహానగరంగా 4 శతాబ్దులపాటు వెలిగింది. బుద్ధుడూ, మహవీరుడూ కూడా అజాతశత్రు కాలారంభంలోనే పరమపదించారు.

మహావీరుడి తండ్రి పేరు సిద్ధార్థుడు, తల్లి పేరు త్రిశల. వీరిద్దరూ వైశాలీ, మగధల రాజవంశీయులు. మహావీరుడు యశోద అనే ఆమెను పెళ్ళాడి, కొంత కాలం పవిత్రమైన గృహస్థాశ్రమం గడిపి, 30 వ ఏట సన్యసించాడు. పన్నెండేళ్ళు తపస్సు చేశాడు. చివరకు "కేవల జ్ఞానం" సంపాదించాడు. ఈయనకు జినుడనే పేరు కూడా వుండేది. అందుకే ఆయన మతం అవలంబించిన వారికి జైనులనే పేరు వచ్చింది. ఈయన 30 ఏళ్ళపాటు తన మతాన్ని దేశ దేశాల ప్రచారం చేసి, దక్షిణ బీహారులో పావా అనే చోట తన 72 వ ఏట నిర్వాణం పొందాడు. ఈయన నిర్వాణం



బుద్ధ నిర్వాణానికి ముందే జరిగిందట. బుద్ధుడి కథ మనకు తెలిసినదే.

అజాతశత్రువు కొడుకు ఉదాయి. అతని తరవాత అనురుద్ధుడూ, ముండుడూ, నాగ దాసకుడు అనే వారు వరసగా రాజ్యం చేశారు. వీరంతా పితృహంతకులే. నాగ దాసకుడనే వాణ్ణి పౌరులు వెళ్ళగొట్టి శిశు నాగుడనే మంత్రిని రాజుగా చేశారట.

శిశునాగుడి తరవాత రాజైన కాలాశోకుడు (లేక కాకవర్ణి) అనే వాడు పాటలీపుత్రాన్ని తన శాశ్వత రాజధానిగా చేసుకున్నాడు. ఇతని పరిపాలన సాగిన 10 వ ఏట బుద్ధ పరినిర్వాణం జరిగి నూరేళ్ళు నిండాయి.

ఇతను హత్య చేయబడ్డాడు. ఇతనికి పిల్లలున్నప్పటికీ వారికి రాజ్యం దక్కలేదు. మగధ సింహాసనం శైశునాగుల నుంచి నందవంశానికి సంక్రమించింది.

మొదటి నందు డెవరో స్పష్టంగా తెలియదు. ఇతను శైశునాగులకు శూద్ర స్త్రీ వల్ల జన్మించాడని కొందరూ, ఒక వేశ్యకు మంగలి-వల్ల జన్మించాడని కొందరూ చెబుతారు. నందుడు అనేకమంది క్షత్రియులను సంహరించి తన సామ్రాజ్యాన్ని దృఢంగా స్థాపించుకున్నా డనటానికి చాలా ఆధారాలున్నాయి. అలెగ్జాండరు కాలం నాటికి బియాస్ నది అవతల ఉండే ప్రజలందరూ ఒకే సామ్రాజ్యానికి చెందినవారనీ, దానికి రాజధాని పాటలీపుత్రమనీ గ్రీకులు రాశారు. ఈ నందుడికే మహాపద్మ నందుడనీ, మహాపద్మపతి నందుడనీ పేరుండేది. ఈ పేర్లు ఇతనికి గల అంతులేని సేనలను సూచిస్తాయి. బౌద్ధమత గ్రంథాలలో ఇతనికి ఉగ్రసేనుడనే పేరు కూడా కనిపిస్తుంది. నందవంశం వారు తొమ్మిది మంది మాత్రమే మగధ రాజ్యాన్ని పరిపాలించారు. వీరిలో ఎనిమిది మంది మొదటి నందుడి కుమారులు. వీరందరూ వరసగా ఒకరి తరవాత ఒకరు రాజ్యం చేశారు. వీరిలో ఆఖరి వాడైన ధననందుడు ప్రజాకంటకుడు. అపారమైన ధనాన్ని పోగుచెయ్యటం కోసం ప్రజలను పన్నుల భారంతో పీడించాడు. ప్రజలు ఇతణ్ణి ద్వేషించి, రోశారు.

అందుకే నందవంశం అంతరింప జేసి చంద్రగుప్తుడనే వాడు ప్రజానాయకుడైనాడు. చంద్రగుప్తుడితో మగధ సామ్రాజ్యానికి మౌర్యులు చక్రవర్తులయారు.

నందులను తుదముట్టించి మగధ సింహాసనాన్ని చంద్రగుప్తుడి వశం చెయ్యటానికి కౌటిల్యుడు (లేక చాణక్యుడు) అనే ఒక బ్రాహ్మణుడు తోడ్పడ్డాడు. ఈ బ్రాహ్మణుడిది తక్షశిల.





# పార్వతీకల్యాణము

ప్రథమాశ్వాసము

ఉత్తరమున మహోన్నతంబయి
ఒప్పుచున్న హిమాలయం బదె,
పూర్వ పశ్చిమ దిశల నంటుచు
భువి కొకా నొక కొలత బద్దగ!

గగన గంగాఝరులు ఆ గిరి
కంఠమున వ్రేలాడుచుండును,
మేఘపంక్తుల దాటి శిఖరము
మింటి చుక్కల నంటుచుండును!

ఓషధులకును, రత్నములకును
ఉనికి పట్టది ఎంచి చూడగ;
వెలయు నా గిరి భరతభూమికి
వెల్లవేసిన కోట గోడగ!

తనను పోలిన కొండ లెవ్వియు
ధరణి లేవని విఱ్ఱ వీగుచు,
నవ్వుకొనుచున్నట్టు లా గిరి
నివ్వటిలు పెనుమంచు కాంతుల!

అట భగీరథు డభ్రగంగను
అవని దింపగ తపము చేసెను,
అచటి మానస సరసియందున
శచికి ఇంద్రుడు ఈత నేర్పెను.

సిద్ధ సాధ్యులు ఆ హిమాలయ
శిఖరమందు వసించుచుందురు,
సంజ వేళల దేవకన్యలు
జంటలై విహరించుచుందురు.

ఏనుగు లచ్చటి దేవదారువు
వృక్షములతో గ్రుద్దులాడును;
కొండరాళ్ళకు రుద్దుకొని పో
గొట్టుకొను చెక్కిళ్ళ దురదలు.

అచట కిన్నర పాటగాంగ్రకు
అద్రిరాజు వెదుళ్ళ మాటున
వేడ్క తాళము వేయునో యన
వెదురుపొద లింపొదవ మ్రోగును!

ఉత్పల సత్యనారాయణాచార్య



అచటనుండిన చమరి మృగములు
అట్టు నిటు నాడించు తోకలు,
అద్రిరాజున కవ్వి చామర
మార్చునట్టులు తోచుచుండును!

ఆ హిమాలయమున కెల్ల
అధినాథుడు హిమవంతుడు,
వివిధౌషధరత్నంబులు
వెలసియున్న ధనవంతుడు.

అతడు పరిణయమాడె మేనక
యనెడు ఒప్పులకుప్ప నొకతెను,
వారలకు మైనాకు డనియెడు
పేరి కొమరుం డొకడు కలిగెను.

దక్షయజ్ఞమునందు పూర్వము
దగ్ధమైన సతీమతల్లిక
మేనకా హిమవంతులకు జ
న్మించె వారల పుణ్య ఫలముగ!

ఆమె పుట్టిన యపుడు వీచెను
హాయి గూర్చెడి కమ్మగాడ్పులు,
దివిని మ్రోగెను తూర్యరవములు,
భువిని కురిసెను పూల జల్లులు.

ఉమ యటంచును తల్లిదండ్రులు
తమ కుమార్తెకు పేరు పెట్టిరి,
పార్వతీ! యని, హైమవతి! యని
పదుగు రామెను పిలువసాగిరి.

నిమిషమైనను నేల దింపక
నిరతమును అల్లారుముద్దుగ
తల్లిదండ్రులు ఉమను పెంచిరి,
దాది రొమ్మున, దూది పాన్పున.

చిన్నతనమున నుండి పార్వతి
శివునిపైననె మనసు నిల్పెను,
ఆట పాటల సతని గొల్చుచు
అఖిల కళలం దారితేఱెను.

చెలులతో గంగాతటంబున
చేరి గుజ్జెనగూళ్ళ నాడును,
భవనమున రత్నాల వీణను
పట్టి ఈశ్వరనుతులు పాడును.

లేత తీగకు మవ్వ మెక్కిన
రీతి యౌవన మబ్బె నామెకు,
పువ్వునకు నెత్తావి పోలిక,
బొమ్మకును నునుమెఱుగు పోలిక.

హంస లామెకు నడలు నేరిపి,
ఆమె అందెల రవళులెల్లను
తాము నేర్చుచునున్నవో యన
ఆమె పదపద్మాల గొల్చును!

ఆమె యెఱ్ఱని పెదవిపై దర
హాస మెప్పుడు ఒప్పుచుండును,
చిగురుటాకున కల్వ పూవుగ,
పగడమందున మౌక్తికమ్ముగ.

రంగుకుంచెను దిద్దితీర్చిన
రమ్య చిత్రమువోలె పార్వతి
ప్రొద్దు పొడుపున అరవిచ్చిన
పువ్వువలె విలసిల్లె వయసున.

యుక్తవయసు వచ్చినట్టి
ఉమను చూచి హిమవంతుడు
తగిన వరుడు ఎవడా యని
తలపోయగ సాగినాడు.

ఒక దినమున నారదముని
ఊర్ధ్వ లోకమందు నుండి
హిమవంతుని మందిరమున
కేతెంచెను సంతసమున.

నారదముని నాదరముగ
గౌరవించి హిమవంతుడు
అర్ఘ్యపాద్యముల నొసంగి
అర్చన గావించినాడు.

తన కూతును మ్రొక్కజేసి
మునితో ననె హిమవంతుడు:
"దేవమునీ! తమ కించుక
తెలియరాని దొకటి లేదు—



నా సుత యగు ఈ కన్యకు
నాథు దెవడు కానుండెనొ ?
దేవమునీ ! ఎఱిగింపుము,
దీనుని నను కరుణింపుము."

అని నంతట నారదముని
ఆమె చేయి పరికించెను,
అబ్బురపడి ఉబ్బిపోయి
అతని కిట్లు వచియించెను :

"సగభాగం బీమె మేన
మగటిమి కలదని యెంతును,
స్వర్గంగా నది ఈమెకు
సవతియనుచు భావింతును.

ఏన్గు మొగము కొడు కొక్కడు
ఈమెకు జన్మింపగలడు,
ఆర్మొగములు గల కొమరుడు
అటు పిమ్మట పుట్టగలడు.

అష్టైశ్వర్యము లుండిన
యట్టివాని వరియించును,
అత్త మామ లేని యింట
హాయిమీఱ సుఖియించును.

అఖిల విభవ మొప్ప నీమె
అన్నపూర్ణ యట్లున్నది !
పదునాలుగు భువనంబులు
పాలించెడు నట్లున్నది !

అవు నవు నిక నీ కూతురు
శివునికి అర్ధాంగి యగును !
ధన్యుడవో అద్రిరాజ !
దక్షుని మించిన వాడవు !"

అని నారదముని వీణను
గొని మ్రోగించుచు నేగెను ;
చెలికత్తెల మొత్తము కిల
కిలమని ఉమకడ మూగెను. —(సశేషం)






# 7

[బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి ముందు హోమం చేయసాగాడు. ఈ లోపల బ్రహ్మపురరాజుగారి అంగరక్షకుడు ఇద్దరు సైనికులతో కొండ దగ్గిరకు వచ్చాడు. అక్కడ వాళ్ళకు కేశవుడి తండ్రి అయిన ముసలివాడు కనిపించాడు. సైనికులు అతణ్ణి కొండ మీదికి దారితీయమన్నారు. వాడు కొండ ఎక్కటం ప్రారంభించాడు. తరవాత—]

ఎత్తుగా వున్న ఒక చోట, రాళ్లచాటుగా నిలబడి కొండ కిందికి చూస్తున్న జయమల్లుకు నలుగురు మనుషులు కొండ ఎక్కటం కనిపించింది. గుహలో బ్రహ్మదండి మాంత్రికుడు, కాలభైరవుడి ముందు ముగ్గులు వేసి, వాటి మధ్య కేశవుణ్ణి కూచో పెట్టి హోమం చేస్తూ మంత్రాలు పఠిస్తున్నాడు. కేశవుణ్ణి కాలభైరవుడు ఆవేశించబోతున్నాడనీ, ఆ స్థితిలో అతణ్ణి చూడటం ప్రమాదం అని చెప్పి, అతడు జయమల్లును గుహ నుంచి బయిటికి పంపేశాడు. కాని, జయమల్లు వీలు దొరికినప్పుడల్లా గుహ దగ్గిరకు వెళ్ళి లోపల జరుగుతున్న తతంగం అంతా చాటుగా వుండి చూస్తూనేవున్నాడు.

జయమల్లు తెలుసు కోవాలనుకుంటున్న దేమిటంటే ; కాలభైరవుడు ఆవేశించినప్పుడు కేశవుడు ఏమి చెపుతాడన్నది. రాకాసి లోయకు వెళ్ళే మార్గం, అక్కడున్న ధనరాసులో మరేవో వున్న చోటూ, మాంత్రికుడు తెలుసుకోవాలని చూస్తున్న సంగతి అతడికి




లోగడే తెలుసు. ఒకసారి, ఆ రహస్యం తెలుసుకున్న తరవాత మాంత్రికుడు, కేశవుణ్ణి చంపేస్తాడన్న అనుమానంకూడా జయమల్లుకు వుంది. కనక, తాను రాకాసి లోయకు వెళ్ళే మార్గం ఏదో వినాలి. కాల భైరవుడు ఆవేశించినప్పుడు కేశవుడు చెప్పే మాటలు, వాడు పదిలిపోయిం తరవాత, అతడికి జ్ఞాపకం వుండే అవకాశంలేదు. కనక తనే విని జ్ఞాపకం వుంచుకోవాలి.

జయమల్లు యిలా ఆలోచిస్తూ, కొండ దిగువకు చూసేసరికి, కొండ ఎక్కుతున్న నలుగురిలో నుంచి ఒకడు వెనుదిరిగి, వేగంగా అడవిలోకి పరిగెత్తి పోతున్నాడు.



తతిమ్మా ముగ్గురూ శిలా ప్రతిమల్లా కదలా మెదలక నిలబడి, కొండ పైకి చూస్తున్నారు.

ఆ ముగ్గుర్నీ అంత ఆశ్చర్య పరిచిన సంగతేమిటా అని జయమల్లు వెనుదిరిగి చూశాడు. గుహలో నుంచి నల్లని పొగ బయటికి వచ్చి, తాటిచెట్టు ప్రమాణాన ఆకాశంలోకి లేచింది. కొండ ఎక్కుతున్న ముగ్గుర్నీ, ఆశ్చర్య పరిచిన దృశ్యం అదేనని జయమల్లు గ్రహించాడు. ఇప్పుడు తనేం చేయాలి? బ్రహ్మదండి మాంత్రికుడితో, చెప్పాలా? చెపితే...చెప్పక పోతే......

ఈలోపల రాజుగారి అంగరక్షకుడు కొండ దగ్గిర నుంచి పంపిన సైనికుడు బ్రహ్మపురం కేసి వాయువేగ మనోవేగాలతో పరిగెత్తుతున్నాడు. వాడికి అదృష్టం కొద్దీ దారిలో, గుర్రాన్నెక్కి పోతున్న ఒక శత వృద్ధు కనిపించాడు. ఇదే అదననుకుంటూ సైనికుడు కత్తి దూసి, ఆ వృద్ధుణ్ణి భయపెట్టి గుర్రం మీంచి కిందికి లాగి, దాన్నెక్కి నగరం కేసి దౌడు తీశాడు.

కోట ముఖద్వారం దాటి ఆవరణలోకి అడుగు పెడుతూనే, సైనికుడు, "మహా రాజా, మహారాజా!" అంటూ కేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే కొత్తగా నియమితుడైన సేనానాయకుడు భవనంలో





నుంచి బయిటికి వచ్చి, "ఏయ్, నోరు ముయ్! ఏకంగా మహారాజుగారినే కేకలు పెట్టి పిలుస్తున్నావే, నీకేమన్నా మతి పోయిందా? ఏమిటీ సంగతి?" అని గద్దించి అడిగాడు.

సైనికుడు దానితో అదురుకుని, "సేనానీ, రాజుగారి అంగరక్షకుడు నన్ను పంపాడు. కొండమీద వున్న ఒక గుహలో నుంచి నల్లని పొగ బయులుదేరి ఆకాశం ఎత్తు లేస్తున్నది. గుహలో మాంత్రికు డొకడున్నాడనీ, వాడే లోగడ సేనానాయకుణ్ణి చంపాడనీ, ఒక ముసలివాడు చెప్పాడు. ఆ వార్త రాజుగారికి చెప్పి, మరికొందరు సైనికుల్ని వెంటపెట్టుకు



రావలసిందిగా అంగరక్షకుడు నన్ను పంపాడు," అన్నాడు.

"అదీ చెప్పవలసిన తీరు! ఒక్క గుక్కలో అన్ని వివరాలూ చెప్పేశావ్. ఇక నోరు మూసుకుని నా వెంట రా," అంటూ సేనానాయకుడు, సైనికుణ్ణి వెంటపెట్టుకుని రాజుగారి దగ్గిరకు వెళ్ళాడు.

రాజుగారూ, రాజగురువూ సేనానాయకుడు చెప్పినదంతా విని, సైనికుణ్ణి, "ఆ ముసలివాడెవరు?" అని ప్రశ్నించారు.

"వాడు మాకు అడివిలో కనిపించాడు. తను అడివిలో కందమూలాలూ, ఆకలములూ తిని బతుకుతుంటానని చెప్పాడు," అన్నాడు సైనికుడు.

"గుహలో నుంచి పొగరావటానికి కారణం మాంత్రికుడే ఎందుకై వుండాలి? శత్రుసైనికు లెందుక్కాగూడదు?" అని ప్రశ్నించాడు రాజగురువు.

"కాదని ఆ ముసలాడే చెప్పాడు. తను అడవిలో ఆ మాంత్రికుణ్ణి చాలాసార్లు చూశాడట. వాడుండే గుహకూడా తనకు తెలుసునన్నాడు," అన్నాడు సైనికుడు.

"వింత జంతువును గురించి ఆ ముసలాడి కేమైనా తెలుసా?" అని రాజుగారు ప్రశ్నవేశాడు.





"ఆ వింతజంతువు ఆ మాంత్రికుడి సృష్టేనని ముసలాడి నమ్మకం. తను మాత్రం ఆ జంతువును చూడలేదన్నాడు, మహారాజా," అన్నాడు సైనికుడు.

"గురువర్యా, ఏమిటి కర్తవ్యం?" అన్నాడు రాజుగారు.

రాజగురువు ఓ క్షణకాలం ఆలోచించి, "ఆ కొండ మీది గుహలో ఎవడో మాంత్రికుడున్నాడనేందుకు సందేహం లేదు. శత్రు సైనికులైతే అంత తెలివి తక్కువగా గుహలో నుంచి పొగ బయట పడనివ్వరు. అలా జరిగితే వాళ్ళ రహస్యం మనకు తెలిసి పోతుందిగదా. కనుక, అంత తెలివితక్కువ శత్రువులుండరు. ఇప్పుడు నా అనుమానం ఏమిటంటే, ఆ మాంత్రికుడు ఏదో పెద్ద ఎత్తున గుహలో హోమం చేస్తున్నాడని. లేకపోతే అంత పొగ ఒక్కసారిగా బయట పడేందుకు వీలులేదు. వాణ్ణి మనం ప్రాణాలతో పట్టుకోవాలి," అన్నాడు.

"వాడు దుష్ట మాంత్రికుడుగదా. మనం రహస్యంగా వెళ్ళి వాణ్ణి పట్టుకోగలమా?" అన్నాడు రాజుగారు నిస్పృహ కనబరుస్తూ.

"అదంతా నాకు వదలండి. నేను మంత్ర శాస్త్రం తెలిసిన వాడినైనా, ఇంత వరకూ దాన్ని ఉపయోగంలో పెట్టలేదు.



ఆ దుష్టుడి మంత్రశక్తిని హరించి, వాణ్ణి ఎలా చేజిక్కించుకోవాలో నాకు తెలుసు," అంటూ రాజగురువు, సేనానాయకుడి కేసి తిరిగి, "సేనానీ, మెరికల వంటి వాళ్ళను ఓ పదిమంది సైనికుల్ని ఏరి వెంటనే బయలుదేరేందుకు సిద్ధం చేయి," అన్నాడు.

పది నిమిషాలు గడిచీ గడవక ముందే రాజగురువూ, సేనానాయకుడూ, సైనికులూ గుర్రాలెక్కి, నగరం వదిలి అడవి మార్గాన కొండ దగ్గిరకు బయలుదేరారు. అంగరక్షకుడు పంపిన సైనికుడు దారి తీస్తున్నాడు.

గుహ ముందు కాపలివున్న జయమల్లు కొండను సమీపిస్తున్న రాజగురువునూ, ఇతర






సైనికులనూ చూశాడు. ఇంతకు ముందు అడివికి అడ్డం పడి పరిగెత్తిపోయిన సైనికుడు, వీళ్ళందర్నీ వెంటపెట్టుకు వస్తున్నాడని అతడికి అర్థం అయింది. గుహలో నుంచి బయిటికి వెలువడుతున్న పొగ మాంత్రికుణ్ణి పట్టించింది. వాడు రాకాసి లోయలో వున్న వేటికోసమో చేసే ప్రయత్నంలో మైమరిచి, తన గొంతుకు వురితాడు పడనున్న సంగతే గుర్తించటంలేదు!

జయమల్లు చప్పున వెనుదిరిగి గుహ దగ్గిరకు వెళ్లాడు. లోపల కంచులా మోగుతున్న బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు చప్పున ఆగిపోయింది. ఆ వెంటనే



కేశవుడి గొంతు వినిపించింది. అతడు చెపుతున్నాడు: "వింధ్యారణ్యాల కవతల ఒక గొప్ప కొండలోయ వున్నది. అదే రాకాసి లోయ. ఆ లోయలో ఒకచోట ఎత్తయిన ఒక రావిచెట్టు. దాని కింద ఒక పాము పుట్ట......" బ్రహ్మదండి మాంత్రికుడు ఎక్కడలేని ఆనందంతో పెద్దగా నవ్వుతూ, "ఊఁ కాలభైరవా, చెప్పు, త్వరగా చెప్పు," అంటూ కేశవుడి భుజంమీద మంత్ర దండంతో గట్టిగా చరిచాడు.

"ఎండి మోడుగా వున్న చెట్టు వెన్నెల రాత్రి ఫల పుష్పాలతో నిండిపోతుంది. పులి రాజును చంపి, చర్మం వలిచి, దాన్ని..." కేశవుడు మాట మధ్యలోనే ఆగి, చేత్తో గొంతు గట్టిగా పట్టుకుని వణికిపోతూ వెనక్కూ ముందుకూ ఊగసాగాడు.

కేశవుడి వాలకం చూస్తూనే, బ్రహ్మదండి మాంత్రికుడు గుహ దద్దరిల్లేలా, "ఆఁ ఎవడు వాడూ? నా మీదే మంత్ర ప్రయోగం చేశాడా? కాలభైరవుడి నోరు కట్టుబడేలా చేశాడా?" అంటూ హుంకరించాడు. జయమల్లు ఒక్క గంతులో గుహ ముందు నుంచి పరిగెత్తి కొండ దిగువకేసి చూశాడు. గుర్రాల మీద వచ్చిన వాళ్ళల్లో నుంచి, ఒకరు కిందికి దిగి, కమండలంలో నుంచి



నీళ్ళు తీసుకుని, కొండ రాళ్ళ మీద చల్లు తూండటం అతడికి కనిపించింది. అతడు రాజగురవు!

బ్రహ్మదండి మాంత్రికుడితో పాటు, తనూ, కేశవుడుకూడా రాజభటులకు చిక్కిపోతామని జయమల్లు భయపడ్డాడు.

"గురురాయా, గురురాయా!" అంటూ జయమల్లు గుహలోకి పరిగెత్తి, "బ్రహ్మపుర సైనికులు కొండ ఎక్కి వస్తున్నారు," అన్నాడు మాంత్రికుడితో.

మాంత్రికుడు పళ్ళు పటపట కొరికి, "వాళ్ళు సైనికులయితే మనకేం భయంరా, శిష్యా. వాళ్ళవెంట తుచ్ఛ మాంత్రికుడెవడో ఒకడున్నాడు. వాడు మన ఉపాసకుల ఊడలమర్రి నేరు కట్టేశాడు. సరే, ఆ తుచ్ఛుణ్ణి కాలభైరవుడికి బలిపెట్టక మానను," అన్నాడు.

"ఆ తుచ్ఛమాంత్రికుడు నేరు కట్టేసే లోపల మనకు కావలసిన సంగతులన్నీ, కాలభైరవుడు చెప్పేశాడా, గురురాయా?" అని అడిగాడు జయమల్లు.

హఠాత్తుగా బ్రహ్మదండి మాంత్రికుడి కనుబొమలు ముడిపడినై. అతడు అనుమానంగా జయమల్లుకేసి చూస్తూ, "నీవేమైనా చాటున దాగివుండి, గుహలో



జరుగుతున్నదంతా చూశావా ఏరా, శిష్యా?" అని అడిగాడు.

"అదేమిటి గురురాయా! నన్ను బయట కావిలి వుండమన్నారు గదా? మీ ఆజ్ఞ పాలించ బట్టే, నేనా బ్రహ్మపుర సైనికుల్ని చూడటం తటస్థించింది. గుహలో జరుగుతున్నదేమిటో చూస్తూ కూచుంటే, కొండను సమీపిస్తున్న శత్రువుల నెలా చూడగలిగేవాడిని?" అన్నాడు జయమల్లు అమాయికంగా.

అప్పటివరకూ మైకంలో వున్న వాడిలా అటూ యిటూ వూగుతున్న కేశవుడు, చప్పున లేచి నిలబడి, చుట్టూ కలయచూస్తూ,

"నే నెక్కడున్నాను? నే నెవణ్ణి?" అంటూ కేకలు ప్రారంభించాడు.

మాంత్రికుడు అతణ్ణి సమీపించి భుజం పట్టుకుని కుదుపుతూ, "నువ్వు కేశవుడివి. మహామాంత్రికుడైన బ్రహ్మదండి గుహలో వున్నావు. తెలిసిందా? అడుగో చూడు, ఉపాసకుల ఊడలమర్రి, ఉన్మత్త భైరవుడు!" అన్నాడు ఆవేశంతో.

కేశవుడు కాలభైరవుడి విగ్రహం కేసి చూసి, "కాలభైరవుడి కళ్ళల్లో వెలుగు కొంచెం తగ్గినట్టుందేం?" అన్నాడు.

జయమల్లు ఏదో చెప్పబోయేంతలో మాంత్రికుడు అతణ్ణి వారించి, "మరేం లేదు, కేశవా. నేను అజాగ్రత్తగా వున్న సమయంలో, ఒక తుచ్ఛ మాంత్రికుడు, నా మీద దొంగదెబ్బ తీశాడు. నువ్వేమీ భయపడకు. వాణ్ణి కొద్ది క్షణాలలో కాలభైరవుడికి బలిపశువును చేస్తాను," అంటూ హుంకరించాడు.

"గురురాయా, మనం యిక్కడ కాలయాపన చేసేందుకు తేదు. ఎక్కడైనా పారిపోదాం. మార్గం చూపండి," అన్నాడు జయమల్లు.

"పారిపోవటమా? ఈ మహామాంత్రికుడు బ్రహ్మదండి, శత్రువులకు భయపడి పారిపోవటమా? ఎంత మాటన్నావు, శిష్యా! కాలభైరవుడే నాకు రక్ష! ఇక్కణ్ణించే, నా మీద దొంగ దెబ్బ తీసిన నీచుణ్ణి హతమారుస్తాను. వాడి పాఠం వాడికే ఒప్పచెపుతాను. మీ యిద్దరు మాత్రం ఎక్కడికైనా దూరంగాపోయి దాక్కోండి," అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి విగ్రహం కేసి నడిచాడు.

కేశవుడు తన విల్లంబులు తీసుకున్నాడు. ఆ తరవాత జయమల్లూ అతడూ కలిసి, గుహ నుంచి బయిటికి వచ్చి, రాళ్ల వెనకగా నక్కుతూ, ఏనుగుల కొలను కేసి పారిపోసాగారు. —(ఇంకా వుంది)





# శాపం పొందిన దేవుడు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "ఈ రాత్రి వేళ హాయిగా హంసతూలికా తల్పంపై పడుకుని సుఖనిద్ర చెయ్యవలసిన నీవు ఈ శ్మశాన ప్రాంతంలో ఇన్ని అగచాట్లు పడుతున్నావంటే నిశ్చయంగా నీకు ఎవరో శాపం పెట్టి ఉండాలి. ఎందుచేతనంటే పుణ్యాత్ముడి శాపం భగవంతుడికి కూడా తగిలి తీరుతుంది. అందుకు దృష్టాంతంగా ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

తూర్పు సముద్రతీరపు దక్షిణపు ప్రాంతంలో సముద్రాన్ని అనుకుని ఒక దేవాలయం ఉండేది. దానికి ఒక బ్రహ్మచారి యువకుడు పూజారిగా ఉండి, రాజు గారిని చిల్లిగవ్వ కూడా కోరకుండా,

## బేతాళ కథలు



ఆ దేవుడికి పూజలూ, ఉత్సవాలూ మొద లైనవి అన్నీ జరుపుతూ ఉండేవాడు.

ఆ పూజారికి ఎవరూలేరు. ఆలయమే అతని ఇల్లు. దేవుడే తల్లీ తండ్రీనూ. ఎవరైనా గ్రామస్థులు వచ్చి నైవేద్యాలు సమర్పిస్తే వాటితో పొట్టపోసుకునే వాడు. పూజలూ అర్చనలూ జరగని సమయంలో ఆలయంలోనే తపస్సు చేసుకుంటూ, తన జీవితం యావత్తూ ఆ స్వామివారికే అంకితం చేసి అందరిచేతా మహాత్ము డనిపించు కుంటూ ఆ పూజారి జీవిస్తున్నాడు.

పిల్లలు లేనివాళ్ళూ, కష్టాలలో ఉన్న వాళ్ళూ, కాలం కలిసిరానివారూ ఆ దేవుడికి మొక్కులు మొక్కుకునేవారు; తమ కోరికలు ఈడేరితే తమ మొక్కులు చెల్లించే వారు. దేవుడికి ఎవరైనా విలువగల కట్నాలు చెల్లించి నప్పుడు పూజారి వాటిని రాజుగారికే పంపించేవాడు.

ఆలయానికి సమీపంగా ఉండే గ్రామంలో ఒక ధనికు డుండేవాడు. ఆయనకు పిల్లలు లేరు. ఒక సారి ఆయన గుడికి వచ్చి, దేవుడికి అభిషేకం చేయించి, తనకు మగ పిల్లవాడు కలిగేలాగు అనుగ్రహించినట్టయితే స్వామివారికి బంగారు మామిడిపండు కానుకగా సమర్పించుకుంటానని మొక్కు కున్నాడు. అదృష్టవశాత్తూ ఆ ధనికుడి కోరిక ఈడేరింది. ఆయన అభిషేకం చేయించిన కొద్ది రోజులకే భార్య గర్భవతి అయి, కాల క్రమాన మగ శిశువును కన్నది. ధనికుడు కంసాలి చేత ఒక బంగారు మామిడి పండు చేయించి, అది పట్టుకుని గుడికి వచ్చాడు.

ఆ సమయానికి పూజారి దేవుడి పూజా పునస్కారాలన్నీ ముగించుకుని ధ్యాన సమాధిలో కూర్చుని ఉన్నాడు. ధనికుడు తాను తెచ్చిన బంగారు మామిడిపండును పూజాద్రవ్యాలతో ఒక పళ్ళెంలో ఉంచి, ఆ పళ్ళాన్ని పూజారి సమీపంలో పెట్టి, "స్వామీ, నే నిప్పుడే సముద్రంలో స్నానం

చేసి వస్తాను. నేను రాగానే అర్చన చేతురు గాని!" అని స్నానానికి వెళ్ళాడు.

అయితే ధ్యానసమాధిలో ఉన్న పూజారికి ధనికుడు రావటంగాని, ఆయన అన్న మాటలు గాని తెలియనే తెలియదు. తన సమీపంలో ఉన్న పళ్ళాన్నీ, అందులోని బంగారు మామిడిపండునూ అతను చూడ నైనా లేదు. ధనికుడు బంగారు మామిడి పండును పూజారి సమీపంలో ఉంచి వెళ్ళి పోయిన కొద్ది క్షణాలకే ఒక దొంగ గుడి లోకి వచ్చాడు.



ఆ దొంగకు కూడా ఆ గుడిలోని దేవుడి యందు అపారమైన భక్తి, విశ్వాసా లున్నాయి. వాడిది పెద్ద సంసారం. పన్నెండు మంది పిల్లలనూ, భార్యనూ మరే విధం గానూ పోషించలేక దొంగ వృత్తి అవలం బించాడు. సాధారణంగా దొంగలు తమ స్వశక్తి పైనే ఆధారపడతారు. ఈ దొంగ మటుకు పూర్తిగా స్వామి వారిపైనే ఆధార పడేవాడు. అందుకే వాడు దొంగ తనానికి బయలుదేరేటప్పుడల్లా గుడికి వచ్చి, దేవుడికి దణ్ణం పెట్టుకుని, తాను చేయబోయే దొంగ తనం సఫలమయేటట్టూ, తనకు ఏ అపదా రాకుండా ఉండేటట్టూ చూడమని మొక్కు కునేవాడు. వాడి కోరిక నెరవేరుతూనే ఉండేది. అంతా ఆ దేవుడి చలవేనని వాడు అనుకుంటూ ఉండేవాడు.

ఈ నాడు ఆ దొంగ స్వామివారికి దణ్ణం పెట్టుకు పోదామని వచ్చాడు. ఎందుకంటే, వాడి పిల్లలు తిండికి మాడుతున్నారు; ఆ రాత్రి వాడు దొంగతనానికి బయలుదేర నిశ్చయించి, స్వామివారికి మొక్కుకు పోదామని వచ్చాడు.

దొంగ గుడిలోకి అడుగు పెట్టగానే వాడికి పళ్ళెంలో బంగారు మామిడిపండు కని పించింది, ధ్యాన సమాధిలో ఉన్న పూజారి కనిపించాడు. వాడు దేవుడికి దణ్ణం పెట్టుకుని, "స్వామీ, పిల్లలు తిండికి మాడు



తున్నారు. విధిలేక ఈ రాత్రికి దొంగతనానికి బయలుదేరదా మనుకున్నాను. నీ దయ వల్ల ఈ బంగారు మామిడిపండు దొరికింది. దీనితో నేనూ, నా కుటుంబమూ చాలా కాలం హాయిగా బతుకుతాం. ఇప్పట్లో మళ్ళీ దొంగ తనానికి బయలుదేరే పనికూడా ఉండదు," అని దేవుడికి చెప్పుకుని, బంగారు మామిడి పండు తీసుకుని తన దారిన వెళ్ళిపోయాడు.

ధనికుడు ఈ లోపుగా స్నానం చేసి, ఆలయానికి తిరిగి వచ్చాడు. గుడిలోకి అడుగు పెడుతూనే పళ్ళెంలో బంగారు మామిడిపండు లేకపోవటం చూసి, "బంగారు పండేదయ్యా, పూజారీ? తీసి దాచిపెట్టావా?" అన్నాడు ఆయన. అంతకు పూర్వమే కళ్ళు తెరిచిన పూజారి, "మామిడి పండేమిటి? నేను దాచలేదే?" అన్నాడు.

"నీతో చెప్పి బంగారు మామిడిపండు పళ్ళెంలో ఉంచి, స్నానం చేసి రావటానికి వెళ్ళాను. ఇప్పుడు చూస్తే లేదు. దాన్ని ఏం చేశావు?" అని ధనికుడు గట్టిగా అడిగాడు.

"నాకేమీ తెలియదు," అన్నాడు పూజారి. ధనికుడికి మండిపోయింది.

"అది స్వామివారికి నేను మొక్కుకున్న బంగారు మామిడిపండు! నీ వికక్కడ ఉండేది దేనికి? స్వామివారి సొత్తు అపహరించ టానికా?" అన్నాడు ధనికుడు.

"అయ్యా, నాకు స్వామివారి సొత్తుతో ఏం పని? స్వామి అర్చనతోనే నా జీవితం సుఖంగా వెళ్లి పోతున్నది. స్వామివారి ప్రసా దంతో నా పొట్ట నిండుతున్నది. బంగారం అపహరించి నేనేం చేసుకుంటాను?" అన్నాడు పూజారి.

"దొంగలంతా ఇలాగే మాట్లాడతారు. నువు చెప్పుకునే దేదో రాజుగారికే చెప్పుకో. నే నిప్పుడే వెళ్ళి నీ మీద ఫిర్యాదు చేస్తు న్నాను," అంటూ ధనికుడు వెళ్ళి పోయి, పూజారి బంగారు మామిడిపండును

కాజేశాడని రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేశాడు. రాజుగారు పూజారిని విచారణ చేశాడు. ధనికుడు అబద్ధమాడి పూజారికి దొంగతనం కట్ట వలసిన అవసరం లేదు. అయనకు మగ బిడ్డ కలిగిన మాటా నిజమే, ఆయన స్వామివారికి అర్పించటానికి బంగారు మామిడి పండు చేయించిన మాటా నిజమే.

బంగారు మామిడి పండు పోయిన సమయంలో గుడిలో పూజారి ఒక్కడే ఉన్నాడు. అతను పేదవాడు. బంగారం కోసం ఆశపడి దొంగతనం చేస్తే చెయ్యవచ్చు. ఇలా ఎన్ని దొంగతనాలు చేసి, రాజుగారికి చెందవలసిన కానుకలు తానే కాజేశాడో!

ఈ విధంగా అనుకుని రాజుగారు పూజారికి కొరడా దెబ్బల శిక్ష విధించాడు. రాజభటులు తనను కొరడాలతో కొడుతూ ఉంటే పూజారికి మండిపోయింది—రాజు మీదా, ధనికుడిమీదా కాదు, తాను ఇంత కాలమూ భక్తితో అరాధించిన దేవుడి మీద.

"దొంగతనం జరిగినప్పుడు నేను తప్ప ఎవరూ లేరంటున్నారు. మరి నీవేమై పోయావు? నిజం ఏమిటో నీ వెందుకు చెప్పవు? ఇంత కాలంగా నీకు అర్చనలూ, అభిషేకాలూ చేయించి నందుకు నా కిదా ప్రతిఫలం? నన్ను కాపాడలేని వాడివి,



నీ కొక ఆలయం కూడా దేనికి? నీవూ నీ ఆలయమూ సముద్రంలో కలిసి పోరాదూ?" అని ఆక్రోశించాడు పూజారి.

పూజారి ఈ మాటలు అంటూ ఉండగానే సముద్రం మీది నుంచి ప్రళయకాలపు మారుతం లేచి వచ్చింది. భూమి కంపించింది. ఉప్పెన తరంగాలు వచ్చి తీరం మీద విరుచుకు పడ్డాయి.

ఈ అర్భాటమంతా అణిగి పోయాక చూస్తే సముద్రతీరాన గుడి లేదు. సముద్రంలో కలిసిపోయింది.

దేవుణ్ణే శపించిన ఆ పూజారికి రాజుగారు క్షమాపణ చెప్పుకున్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, దేవు డింత తెలివి తక్కువ పని ఎందుకు చేశాడు? ఆ దేవుడు మహిమ గలవాడు గనకనే ఆయన భక్తుడికి శపించే శక్తి వచ్చిం దనుకో వాలి గద. అంత మహిమ గలవాడు తన భక్తుణ్ణి తప్పించలేక పోయాడా? అలా చేయకపోగా భక్తుడి శాపానికి గురి అయి తనకు ఆలయం కూడా మిగలకుండా ఎందుకు చేసుకున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అన్నీ ఆలో చించే దేవుడు సరి అయిన మార్గం అవలం బించాడు. అది తెలివి తక్కువ పనీ కాదు. మొదటి సంగతి, దేవుడు పూజారిని రక్షించా లంటే దొంగను బయటపెట్టాలి. ఇద్దరూ తనను నమ్ముకున్న భక్తులే. పూజారి ఒంటరి గాడు, దొంగకు ఆపద వస్తే పదముగ్గురు ప్రాణులు కష్టాలపాలవుతారు. రెండో సంగతి, పూజారికి తాను సాక్ష్యం చెప్పితే అది ఏదో ఇంద్రజాల మనుకుంటారు ప్రజలు. పూజారి చేత తాను శాపం పొందితే అతని మహత్తు లోకానికి మరింత స్పష్టంగా తెలిసివస్తుంది. మూడో సంగతి, దేవుడికి ఈ ఆలయం ప్రతిబంధక మయింది. తన భక్తులంతా ఒక రకం వాళ్ళు కారు. వారిలో దొంగలున్నారు, దరిద్రు లున్నారు, ధనికులున్నారు. ఒకరి స్వార్థం ఒకరికి కిట్టదు. అందరికన్నా స్వార్థ పరుడు రాజు. దేవుడికి ప్రజలు చెల్లించే ప్రతి కానుకా తనదిగా భావించి రాజు గుడిలో జరిగే చిన్న దొంగతనాలకు కూడా పెద్ద శిక్షలు ఇస్తాడు. ఈ తేడాలన్నిటినీ సమన్వయించలేక భగవంతుడు తన ఆలయం సముద్రం పాలయే ఏర్పాటు చేసుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# సజ్జనుడి పాట్లు

## 2

స్నేహితు లిద్దరూ గుడారంలో భోజనాలు చేసేటప్పుడు, జాఫర్‌ను పెళ్లాడిన స్త్రీ మేనా తెరలు తొలగించి వారిద్దనీ చూసింది. వారిద్దరూ స్నేహితులు గనకనే అత్తఫ్ ఈ మనిషి కోసం తనను త్యాగం చేశాడని ఆమె గ్రహించింది. ఆమె కళ్ళవెంట అశ్రువులు రాలాయి.

జాఫర్ పరివారంకూడా కదిలింది. జాఫర్ మేనా చెంతకు వచ్చి, "ప్రేయసీ, నా హృదయాన్ని నిజంగా ముక్కలు చేశావు గద!" అన్నాడు.

ఆమె అతనితో, "నేను మీ ప్రేయసిని కాను. మీ మిత్రుడైన అత్తఫ్ ప్రేయసిని. మీ కోసం నన్ను త్యాగంచేశాడు. మీ మనస్సు నిర్మలమైనదైతే నన్ను అతనికి తిరిగి ఇచ్చెయ్యండి," అన్నది.

"ఇది నిజమా?" అన్నాడు జాఫర్ గుండె దడదడలాడుతూ.

"అవును. ఆనాడు నన్ను చూసివెళ్ళి అతనితో మీ ప్రేమ గురించి వెళ్ళబోసుకుని ఉంటారు. అతను మిత్రులకు తన ప్రాణమైనా ఇచ్చేస్తాడు," అన్నదామె.

జాఫర్ ఇది విని పెద్దపెట్టున ఏడుస్తూ, "అమ్మా, నీవు నా సొత్తు కాదు. నిన్ను కాపాడే భారం ఇకనుంచీ నాది!" అన్నాడు. ఆమెను వెంటనే డమాస్కసుకు పంపవచ్చు కాని, అందులో చాలా చిక్కులున్నాయి. ఆమె తండ్రి అనేక ప్రశ్నలు వేస్తాడు. తన కోసం అత్తఫ్ చేసిన వంచన బయట పడుతుంది. అందుకని అత్తఫ్‌ను బాగ్దాదుకు పిలిపించి ఆమెను అతని పరం చెయ్యటమే సరి అయినపని. జాఫర్

సి. మాధవరావు




బాగ్దాదుకు తన ప్రయాణాన్ని సాగించాడు. ఈ లోపుగా బాగ్దాద్‌లో ఖలీఫా జాఫర్‌కు తాను చేసిన అన్యాయాన్ని తెలుసుకుని బాధ పడ్డాడు. పాపం, గొప్పవంశంలో పుట్టిన జాఫర్ బికారిగా ఎడారుల వెంట తిరుగుతున్నాడు కాబోలునని అనిపించినప్పుడల్లా ఖలీఫా గుండె తరుక్కుపోయింది. ఆయన జాఫర్ జాడ తెలుసుకురమ్మని అన్నివేపులా మనుషులను పంపాడు.

నాలుగు నెలల అనంతరం జాఫర్ సపరివారంగా తిరిగి వస్తున్న వార్త ఖలీఫా చెవిన పడింది. ఖలీఫా పరమానందంతో ఎదురువెళ్ళి, జాఫర్‌ను ఆలింగనం చేసుకుని, "ఇన్నాళ్లూ ఎక్కడెక్కడ తిరిగావు? ఏమేం చేశావు?" అని అడిగాడు.

జాఫర్ ఆయనతో అత్తఫ్ విషయమంతా చెప్పాడు. ఖలీఫా ఆ కథ విని విస్మయం చెంది, "అంత ఉదార పురుషులుంటారా? అతనికి పెద్ద అన్యాయం జరిగింది, జాఫర్. అంత స్నేహపాత్రుణ్ణి మనం పోగొట్టుకోరాదు. అతన్ని పిలుచుకు రావటానికి మనుషులను పంపుతాను," అన్నాడు.

జాఫర్ అత్తఫ్ ప్రియురాలికి మంచి తోట మధ్య ఉండే ఇల్లు ఇచ్చి, దాసీలను ఏర్పాటు చేశాడు. ఆమె ఖర్చుకుగాను నెలకు వెయ్యి దీనారా లిచ్చాడు. తాను ఆ ఇంట ఎన్నడూ అడుగు పెట్టలేదు, కాని రోజూ మనుషులను పంపి ఆమె క్షేమ సమాచారాలు అడిగించి, "నీవూ నీ ప్రియుడూ త్వరలోనే కలుసుకుంటారు!" అని చెప్పించేవాడు.

అక్కడ డమాస్కస్‌లో, అత్తఫ్‌కూ ఖలీఫామంత్రి అయిన జాఫర్‌కూ మంచి దోస్తీ అన్న వార్త పాక్కిపోయింది. అత్తఫ్ శత్రువులు నాయబ్ చుట్టూ ముసిరి, "ఈ మనిషి మీకు పక్కలో బల్లెమే! జాఫర్‌గారిని అంతదూరం సాగనంపి ఇతను చేసిన ఘన కార్యం ఏమిటో తమరు విన్నారా? తమరిని తొలగిస్తూ ఫర్మానా జారీ చెయ్యవలిసిందిగా

ఖలీఫాతో చెప్పమన్నాడట! దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవటం మంచిది!" అని సలహా యిచ్చారు.

నాయబ్‌కు మతి పోయినట్టయింది. అయన అత్తఫ్‌ను కట్టి తెప్పించి మరణ దండన విధించాడు. కాని కొందరు బుద్ధిమంతులు తొందర పడవద్దని ఆయనను హెచ్చరించారు. "కిట్టని వాళ్ళు అబద్ధాలు సృష్టించ గలరు. అతను నిజంగా నిర్దోషి అయితే అతన్ని చంపినందుకు మంత్రి జాఫర్ మిమ్మల్ని సర్వనాశనం చేయగలడు. మరణదండన వార్త ఆయనకు తెలిసే తీరుతుంది," అన్నారు.

ఈ మాటలకు కూడా నాయబ్ దడుచుకుని, అత్తఫ్‌ను ఖైదులోకి తోయించాడు. అయితే కొద్దిరోజుల అనంతరం అత్తఫ్ అదృష్టవశాత్తూ ఖైదు నుంచి తప్పించుకుని ఒక రాత్రి పారిపోయాడు. అతను నానా యాతనలూ పడి, దిక్కులేకుండా చాలా రోజులు సంచరించి, చివరకు బాగ్దాదు ప్రయాణీకుల ముఠా ఒకటి తటస్థ పడగా, వారి వెంట నెల రోజులు ప్రయాణం చేసి బాగ్దాదు చేరుకున్నాడు.

ఆ తరవాత ఏమి చెయ్యాలో అతనికి తెలియులేదు. రెండు రోజులు తిండికూడా



లేకుండా ఊరంతా కాలుకాలిన పిల్లిలాగా తిరిగి, మూడోరోజు మధ్యాన్నం ఒక మసీదు ప్రవేశించి అక్కడ కూచున్నాడు. అతను చూడటాని కిప్పుడు పరమ దరిద్రుడులా గున్నాడు. బట్టలన్నీ పేలికలై పోయాయి. మనిషి మట్టి కొట్టుకుని, చిక్కిశల్యమై ఉన్నాడు. గడ్డమూ, జుట్టూ అట్టలు కట్టుకు పోయాయి. ముఖాన కళాకాంతీ లేవు. కళ్ళు గుంటలు పడ్డాయి. తిండీ నిద్రా సరిగా లేక చూడటానికి రోత పుట్టేలా గున్నాడు.

కొంత సేపటికి అతని కెదురుగా ఒక బిచ్చగాడు వచ్చి కూచుని, పొట్లం విప్పి, రొట్టెలూ, కూరలూ, ఫలాలూ, ఏవేవో వంట

కాలూ పరుచుకుని దర్జాగా భోజనం ప్రారంభించాడు.

ఆకలితో నకనకలాడి పోతున్న అత్తఫ్ ఆ భోజన పదార్థాలు చూసి కంటి వెంట అశ్రువులు రాల్చాడు. బిచ్చగాడు తలఎత్తి అతన్ని చూసి, "నీ కన్నీళ్ళతో ఎడారి యావత్తూ సముద్రం చేసినా ఇందులో నీ కొక్క తుంపుకూడా పెట్టను. కాని సలహా ఇస్తాను విను. ఖలీఫాగారి మంత్రి జాఫర్ రోజూ అడగని వాడిది పాపంగా అంతు లేని దానాలు చేస్తున్నాడు. ఎవడో అత్తఫ్ అనేవాడు ఆయనకు అంతులేని అతిథి సత్కారాలు చేశాట్ట. అందుకని ఆ'మాన వుడు నిద్రలేస్తూనే అత్తఫ్‌ను స్మరిస్తాడు. రాత్రి పడుకోబోతూ అత్తఫ్‌ను స్మరిస్తాడు. ఆయన దగ్గిరికి వెళ్ళి చెయ్యి చాచావంటే నీ కడుపు నిండుతుంది," అన్నాడు.

అత్తఫ్‌కు తల తిరిగి పోయినట్టయింది. తన అతిథి నిజంగానే జాఫర్ మంత్రా? అల్లా మాయ కింతకన్న ఏం నిదర్శనం కావాలి! అత్తఫ్‌కు ప్రాణం లేచివచ్చి నట్టయింది. అతను జాఫర్‌కు ఒక చీటీ రాసి, జాఫర్ ఇంటికి దారి తెలుసుకుని వెళ్ళి, బయట ఉండే ఒక కొట్టావాడితో, "నా పేరు అత్తఫ్! ఈ చీటీ తీసుకుపోయి జాఫర్‌గారికి ఇయ్యి!" అన్నాడు.



కొజ్జావాడు ఉగ్రుడై, "బద్మాష్, ఏమన్నావ్? అత్తఫ్ అంటే ప్రభుపులవారి ఆరోప్రాణం, తెలుసా? నువ్వా పేరు చెప్పుకుంటావురా?" అంటూ చేతిలోని పొన్నుకర్రతో అత్తఫ్ ముఖం మీద బలంగా కొట్టాడు. అత్తఫ్ కింద పడిపోయాడు. అతని ముఖం చిల్లిపడి రక్తం ప్రవాహాలు కట్టింది.

ఇది చూస్తున్న మరొక నౌకరు మొదటి వాణ్ణి మందలించి, అత్తఫ్‌ను లేవదీసి, అతని రక్తం తుడిచి, "నీకేం కావాలి, తమ్ముడూ?" అని అడిగాడు.

"ఈ చీటీ నా సోదరుడైన జాఫర్ మంత్రికి ఇవ్వాలి," అంటూ అత్తఫ్ తన చేతిలో ఉన్న చీటీ ఇచ్చాడు. నౌకరు ఆ చీటీ తీసుకుపోయే సమయానికి జాఫర్ చాలామంది పెద్దలను చుట్టూ పెట్టుకుని గోష్ఠిలో ఉన్నాడు.

"నే నెవరినో, నా హోదా ఏమిటో కూడా అతనికి తెలీదు. అయినా నా కోసం అతను చేయనిది లేదు! అటువంటి వాళ్ళు ప్రపంచంలో ఎక్కడా ఉండరు! అతని ఋణం తీర్చుకోవటం సాధ్యం కాదు," అని జాఫర్ నిండు మనస్సుతో చెబుతూండగా నౌకరు చీటీ అందించాడు.

ఆ చీటీలో "అత్తఫ్" అన్న సంతకం కళ్ళకు కనిపించే సరికి జాఫర్ ఉద్రేకం





వచ్చేసి, స్పృహతప్పి ముందుకు పడి పోయాడు. అతని చేతిలో ఉండే గాజు పాన పాత్ర ముక్కలై పోయింది. ఒక ముక్క జాఫర్ నుదుటికి గుచ్చుకుని పెద్ద గాయ మయింది.

జాఫర్ చుట్టూ చేరిన పెద్దలు ఆవేశం చెంది, "ఎవడా దుర్మార్గుడు? ఎవడా చీటీ పంపినవాడు?" అని కేకలు పెట్టారు.

ఆ మనిషి కోసం పెద్దగా వెతకవలిసిన అవసరంకూడా కలగలేదు. తను పంపిన చీటీకి ఎలాంటి జవాబు వస్తుందో అని బయట వేచి ఉన్న అత్తఫ్, తానే జాఫర్‌కు చీటీ పంపినట్టు ఒప్పుకున్నాడు.

పెద్దలు అతన్ని వలీ వద్దకు పంపించి, అతనికి అయిదువందల కొరడా దెబ్బలు శిక్ష ఇచ్చి ఖైదులో తొయ్యమని చెప్పారు. అత్తఫ్ ఆ శిక్ష అనుభవించి ఖైదు ప్రవేశించాడు.

జాఫర్ అత్తఫ్ పంపిన చీటీ చదవనే లేదు. తాను ఎందుకు స్పృహతప్పి పడి పోయినదీ ఆయనకు జ్ఞాపకం రాలేదు.

అత్తఫ్ కొద్ది రోజులు జైలులో ఉన్నాక ఖలీఫాగారికి ఒక పిల్లవాడు కలగటమూ, జైలు ఖాళీ చెయ్యటమూ జరిగింది. అత్తఫ్ బయటికి వచ్చాడుగాని అతనికి కర్తవ్యం బోధపడ లేదు. డమాస్కసుకు తిరిగి పోతే నాయబ్ చేతిలో చావు తప్పదు. బాగ్దాదులో బతికే దారిలేదు. ఇక్కడ ముష్టి ఎత్తుకునే వాళ్ళుకూడా సంఘాలుగా ఏర్పడి ఉన్నారు. పై వాళ్ళను వీధి వెంట అడుక్కోనివ్వరు. మంత్రి జాఫర్ తన సోదరు డనుకున్నది కాస్తా భ్రమ అని రుజువయింది. ఇక తనకు దేవుడు తప్ప మరెవరూ శరణ్యం లేరు.

అత్తఫ్ పగలల్లా ఏ మసీదులోనో ఉండి భగవద్ధ్యానం చేసుకుని, రాత్రిపూట మసీదులో పడుకోవటం ధర్మవిరుద్ధం గనక, ఏ పాడుబడిన ఇల్లయినా దొరుకుతుందేమో నని వెతుక్కుంటూ బయలుదేరాడు. అతని

అన్వేషణ ఫలించింది. అతను ఒక పాడు బడ్డ కొంపలోకి ప్రవేశించి, చీకటిలో కాలికి ఏదో తగిలి పడ్డాడు. తడివిచూస్తే అదొక మనిషి శవం. ఆ మనిషిని ఎవరో హత్యచేసి, కత్తికూడా అక్కడే వదిలివెళ్ళి పోయారు.

అత్తఫ్ వీధిలోకివెళ్ళి, అటుగా పోతున్న భటులను చూసి, వారితో ఆ శవం సంగతి చెప్పాడు. అతని బట్టలకు రక్తం మరక లుండటం చూసి భటులు, "నీవే హంత కుడివి? అవునా, కాదా?" అని అడిగారు. అతను జవాబు చెప్పక పోయేసరికి హంతకు డని నిశ్చయించి పట్టుకుపోయి ఖైదు చేశారు.

మర్నాడు ఉదయం వలీ జాఫర్ మంత్రి వద్దకు వచ్చి, "నిన్నరాత్రి ఎవరో బిచ్చగాడు ఒక పాడుపడిన ఇంట్లో ఒక మనిషిని హత్యచేసి కత్తితో సహా దొరికి పోయాడు. హత్య ఎందుకు చేశావంటే సమాధానం చెప్పడు. అతడికి ఏమి శిక్ష వెయ్యమని తమ ఆజ్ఞ?" అన్నాడు.

"శిరచ్ఛేదం," అన్నాడు జాఫర్.

ఆ రోజు జాఫర్ కాలినడకన ఎటో వెళుతూండగా వధ్యస్థానం వద్ద గుంపు కన బడింది. ఆయన ఆ గుంపు మధ్యకువచ్చి, వలీతో, "ఎవరినో శిక్షిస్తున్నట్టున్నారే?" అని అడిగాడు.




"అవును, హంతకుడికి శిరచ్ఛేదం చేయి స్తున్నాను. ఎక్కడో డమాస్కసు నుంచి బాగ్దాదుకు వచ్చాడట," అన్నాడు వలీ.

డమాస్కసు అన్నమాట వినగానే జాఫర్ అత్తఫ్ కేసి చూశాడు గాని అతన్ని గుర్తించ లేదు. అత్తఫ్ ఈ మధ్యకాలంలో అంతగా మారి పోయాడు.

"ఏమోయ్, నీది డమాస్కస్ నగరమా? చుట్టుపక్కల పల్లెటూరా?" అని జాఫర్ అడిగాడు.

"నగరమే నండి," అన్నాడు అత్తఫ్.

"అయితే చూడూ, అత్తఫ్ అని ఒక ఉదారుడైన యువకుడు ఆ నగరంలో

ఉంటాడు. నీ కతనేమైనా తెలుసునా ?" అన్నాడు జాఫర్.

"మీరూ అతనూ స్నేహంగా ఉంటూ ఫలాని వీధిలో, ఫలాని ఇంట్లో ఉండటం ఎరుగుదును. అతని బంధువురాలిని మీరు పెళ్ళాడటం ఎరుగుదును. మీరు బాగ్దాదుకు తిరిగి వస్తూ అతనికి వీడ్కోలు చెప్పటం ఎరుగుదును !" అన్నాడు అత్తఫ్.

" ఆ తరవాత అతను ఏమయ్యాడు ?" అని జాఫర్ ఆదుర్దాగా అడిగాడు.

అప్పుడు అత్తఫ్ తన కథ పూసగుచ్చి నట్టు జాఫర్‌కు చెప్పి, "అయ్యా, జాఫర్ గారూ, నేనే అత్తఫ్‌ను !" అన్నాడు.

జాఫర్ కెవ్వున అరిచి అత్తఫ్‌ను ఆలిం గనం చేసుకున్నాడు.

ఇంతలో ఒక వృద్ధుడు, "ఆగండి, ఆగండి !" అంటూ అటు వచ్చాడు.

"ఎవరు నువ్వు ?" అన్నాడు జాఫర్ ముసలివాడితో.

"నేనే అసలు హంతకుణ్ణి," అన్నాడు ముసలివాడు.

"ఎందుకు హత్యచేశావు ?" అని జాఫర్ అడిగాడు.

"వాణ్ణా ? వాడు బద్మాష్ ! వాణ్ణి ఒక సారి కాదు, వెయ్యిసార్లు హత్యచేసినా



పాపం లేదు. కాని, పాపం, నేను చేసిన పనికి ఇంకెవరినో తల తీస్తున్నారని విని పరిగెత్తు కుంటూ వచ్చాను. నిర్దోషి నాకు బదులుగా చనిపోతే నన్ను దేవుడు క్షమించడు !" అన్నాడు ముసలివాడు.

"ఏమో, నీ మాటలు నమ్మదగినవిగా లేవు. నీ మీద నేరం రుజువు కాలేదు. ఎవరి తలా తియ్యటంలేదు. నీ దారిన నువ్వు పో !" అన్నాడు జాఫర్ ముసలాడితో.

తరవాత జాఫర్ అత్తఫ్‌ను చెయ్యి పట్టు కుని స్నానశాలకు తీసుకు వెళ్లాడు. అక్కడ అతనికి చక్కగా స్నానం చేయించి తరవాత ఖలీఫా వద్దకు తీసుకు పోయాడు.

"నీ గురించి జాఫర్ చాలా చెప్పాడు. అలాటి వాడివి ఇలా అయిపోయావు, కుర్రాడా?" అన్నాడు ఖలీఫా. అత్తఫ్ ఆపుకోలేక ఏడ్చాడు. కాని అతను తన కథ అంతా చెప్పాక ఖలీఫా అంతకు రెట్టింపుగా ఏడ్చేశాడు.

తరవాత ఆయన జాఫర్‌తో, "నీవీ యువకుడికి ఎంత రుణపడి ఉన్నావు?" అని అడిగాడు.

"నాలో ఉన్న రక్తమంతా అతని సొత్తే. నేనతనికి బానిసను. అది అలా ఉంచి నా కోసం అతను ముప్పై లక్షల బంగారు దీనారాలు ఖర్చుపెట్టాడు. అతను నాకిచ్చిన కానుకలు ఎన్ని లక్షలవుతాయో నాకు తెలీదు," అన్నాడు జాఫర్.

అత్తఫ్ కష్టాలు గట్టెక్కాయి. నాయబ్‌ను బంధించి ఖైదు చెయ్యవలసిందిగా ఖలీఫా ఉత్తరువు జారీ చేశాడు. అత్తఫ్‌కు అతని ప్రియురాలు తిరిగి లభించింది. అతను బాగ్దాద్ నగరంలో చాలా రోజులు సుఖంగా గడిపిన మీదట, డమాస్కస్‌కు వెంటనే తిరిగి రమ్మని అతని బంధువులు లేఖలు రాసి తొందర పెట్టారు.

ఖలీఫాకు అత్తఫ్ వెళ్ళటం ఏమాత్రం మనస్కరించక పోయినప్పటికీ, అతన్ని డమాస్కస్ నగరానికి వలీగా నియమించి, అంతులేని కానుకలు కట్టబెట్టి, అంతులేని కంచర గాడిదలనూ, ఒంటెలనూ, పరివారాన్నీ ఇచ్చి సాగనంపాడు.

అత్తఫ్ పునరాగమనాన్ని డమాస్కస్ పౌరులు పండుగగా చేసుకున్నారు.

అత్తఫ్ ఇప్పుడు డమాస్కస్ నగరానికి వలీ గనుక అతను నాయబ్‌ను చెర విడిపించి, నగరబహిష్కార శిక్ష విధించాడు.

ఆ నాటి రాత్రి తనకు దొరికిన పుస్తకం మాట ఖలీఫా పూర్తిగా మరిచాడు.

జాఫర్ పొరపాటునకూడా దాని ప్రస్తావన తీసుకు రాలేదు.





# ప్రాణస్నేహితులు

ఫ్రాన్సుదేశంలో ఒకే రోజున ఇద్దరు జమీం దార్లకు ఇద్దరు కుమారులు కలిగారు. ఒకే రోజున పుట్టటమే గాక, కవల పిల్లలలాగా వారిద్దరూ ఒకే పోలికకూడానూ. వారిలో ఒకడి పేరు అమిస్, రెండోవాడి పేరు అమిల్. త్వరలోనే ఈ పిల్లల తండ్రు లిద్దరూ కలుసుకుని తమ కొడుకులు ఒకరి నొకరు పోలి ఉన్న సంగతి తెలుసుకోవటం జరిగింది. అది మొదలు కుర్ర వాళ్ళిద్దరూ స్నేహితులయిపోయారు.

ఏళ్ళు గడుస్తున్నకొద్దీ వారి స్నేహం కూడా గాఢంగా పెరిగింది.

యుక్తవయసు వచ్చాక స్నేహితులిద్దరూ ఏకంగా బయలుదేరి రాజుగారి వద్ద కొలువు చేయ వెళ్ళారు. రాజుగారు వారిద్దరినీ తగిన విధంగా పరీక్షించి, యోగ్యులని తెలుసుకుని, ఇద్దరికీ చెరొక ఉద్యోగమూ ఇచ్చి కొలువుంచుకున్నాడు.

కొద్ది కాలానికి అమిస్ ఒక కన్యను వరించి పెళ్ళాడాడు. ఆమె అమిస్‌ను అంతగా ప్రేమించలేదు, అతనికి గల జమీందారీని మాత్రమే ప్రేమించింది. తన భర్త అమిల్‌ను ప్రాణాలకన్న ఎక్కువగా చూడటం కూడా ఆమెకు ఇష్టం లేదు. అయితే ఈ అసూయను ఆమె తన భర్తకు తెలియనివ్వకుండా తన మనసులోనే దాచుకున్నది.

అమిల్ పెళ్ళాడలేదు. కారణమేమంటే అతను రాజుగారి కుమార్తెనే ప్రేమించాడు. ఆమెను తప్ప మరెవరినీ పెళ్ళాడనని ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

అయితే అమిల్ కోరిక సులువుగా నెర వేరేది కాదు. రాజకుమార్తెకు అమిల్ పైన ఎటువంటి భావం ఉన్నదీ తెలియదు. రాజుగారిని చూడబోతే తన కుమార్తెను ఏ మహారాజు కుమారుడికో ఇచ్చి మరొక

కె. నరసింహారావు

రాజ్యాన్ని తన రాజ్యానికి కలుపుకుందా మన్నంత ఆశతో ఉన్నాడు.

ఒకనాడు అమిస్ తన అత్తవారి ఊరికి బయలుదేరి వెళుతూ తన మిత్రుడితో, "నేను తిరిగి వచ్చేదాకా నీ ప్రేమను అణచిపెట్టుకుని జాగ్రత్తగా ఉండు. లేక పోతే ప్రమాదం జరగవచ్చు," అని హెచ్చరించాడు.

"నేను తొందరపడి ఏమీ చెయ్యను," అని అమిల్ తన మిత్రుడికి మాట ఇచ్చాడు. అమిస్ తన భార్యను చూడ టానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. అమిల్ ఎరగడుగాని రాజకుమార్తె అతనిని కొలువులో చేరినప్పటి నుంచీ ప్రేమిస్తూనే ఉన్నది. అమిస్ తన భార్య వద్ద ఉన్న కాలంలో ఆమె అవకాశం చూసుకుని అమిల్‌ను ఒంటరిగా కలుసుకుని తన రహస్యం చెప్పేసింది. అమిల్ ఆనందానికి మేరలేదు. ఆ తరవాత వారిద్దరూ అనేక పర్యాయాలు రహస్యంగా కలుసుకున్నారు.

ఈ సంగతి రాజోద్యోగులలో ఒకడు కని పెట్టి రాజుగారితో అమిల్ మీద ఫిర్యాదు చేశాడు; వాడికి అమిస్ మీదా అమిల్ మీదా అసలే మంటగా ఉన్నది, ఎందు కంటే రాజుగారు వాళ్ళిద్దరినీ చాలా అభి మానంగా చూస్తున్నాడు.



అమిల్‌పైన ఈ ఆరోపణ చెవిని పడగానే రాజుగారు కోపించి అతన్ని పిలిపించి, "నీవు రాజకుమారిని రహస్యంగా కలుసు కుంటున్నట్టు ఈ ఉద్యోగి ఆరోపణ చేస్తున్నాడు. ఏమంటావు?" అని అడిగాడు.

అమిస్ ఏదైతే జరుగుతుందని భయ పడ్డాడో అక్షరాలా అదే జరిగింది! అమిల్ పాపభీతి కలవాడు. తాను రాజకుమార్తెతో మాట్లాడలేదని ప్రమాణం చేస్తే అది అబద్ధం అవుతుంది. అందుచేత అతను, "నే నేమీ ఎరగను," అని ఊరుకున్నాడు.

"అయితే నేను అబద్ధమాడానా? మనిద్ద రిలో ఎవరిది అబద్ధమో ఈశ్వరుడే తేలు స్తాడు, నాతో ద్వంద్వయుద్ధం చెయ్యి ధైర్యం ఉంటే!" అన్నాడు ఉద్యోగి.

రాజుగారూ, సభికులూ చూస్తూండగా అమిల్ ఆ ఉద్యోగితో ద్వంద్వయుద్ధం చెయ్యటానికి ఒక రోజు నిర్ణయించబడింది. అమిల్ రాజుగారి వద్ద సెలవు పుచ్చుకుని అమిస్‌ను కలుసుకోవటానికి బయలు దేరాడు. అదృష్టవశాత్తూ, నగరం దాటగానే అమిస్ మామగారి ఇంటినుంచి తిరిగి వస్తూ ఎదురయాడు.

అమిల్ తన మిత్రుడికి జరిగినదంతా చెప్పి, "అమిస్, ఇప్పుడు నేనేం చెయ్యాలి? నా మీద ఫిర్యాదు చేసినవాడితో నే నేమని





యుద్ధం చెయ్యను? దేవుడు నన్ను గెలవ నిస్తాడా?" అని అడిగాడు.

అమిస్ కొంచెం ఆలోచించి, "నీవు మా ఊరికి పోయి, నేను కబురు పంపే దాకా అక్కడే రహస్యంగా ఉండు. నీ మీద ఫిర్యాదు చేసిన వాడితో నేను ద్వంద్వయుద్ధం చేస్తాను. మనిద్దరికీ తేడా తెలియదు. అందులోనూ నేను కవచంకూడా ధరిస్తే నీవు కాదని ఎవరూ అనుకోలేరు. నేను రాజకుమార్తెను కలుసుకోలేదనీ ఆమెతో మాట్లాడలేదనీ ప్రమాణం కూడా చెయ్యగలను. ఎందుకంటే అందులో అబద్ధం ఏమీ ఉండదు," అన్నాడు.



అమిల్ తన స్నేహితుడి ఊరు వెళ్ళిపోయాడు. అమిస్ అతని స్థానంలో ద్వంద్వ యుద్ధం చేసి, చాలా సేపు పోరిన పిమ్మట తన ప్రత్యర్థిని చంపేశాడు. ఇందువల్ల అమిల్ నిర్దోషి అని రాజుగారికీ, సభికులకూ రుజువయినట్టయింది.

రాజుగారు తన ఉద్యోగి మాటలు నమ్మి అమిల్‌ను శంకించి నందుకు చాలా నొచ్చుకుని, "పుట్టిన మాట ఎలాగూ పుట్టనే పుట్టింది. మహా యోధుడైన అమిల్‌కు నా కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తాను," అని ప్రకటించాడు.

అమిస్ తన మిత్రుడికి కబురు చేసి, అతన్ని నగరం వెలపల దారిలో కలుసుకుని జరిగిన సంగతంతా చెప్పేశాడు. అమిస్ ధర్మాన అమిల్‌కు అపకీర్తి తప్పిపోవటమే కాక, కలలోకూడా ఆశించని కోరిక నెరవేరుతున్నది.

అమిల్‌కూ రాజకుమార్తెకూ పెళ్ళి అయినాక అతను తన భార్యతో అమిస్ తనకు చేసిన మహోపకారం గురించి చెప్పాడు. అంతా విని ఆమె, "అహా, ఎలాటి స్నేహితుడు! అతని ఋణం తీర్చుకునే అవకాశం మనకు ఎప్పుడు కలుగుతుందో గదా!" అన్నది.



మరి కొంత కాలం గడిచాక స్నేహితు లిద్దరూ రాజుగారి కొలువు మానుకుని, తాము సంపాదించుకున్న సొత్తుతో తమ తమ స్వస్థలాలకు తిరిగి వెళ్లారు.

అమిల్ రాజకుమార్తెతో సుఖంగా కాపరం చేస్తున్నాడు. వారికి ఇద్దరు కుమాళ్లు కూడా కలిగారు. వారికి అవి చాలా మంచి రోజులు. పాపం, అమిస్‌కు మాత్రం రోజులు కలిసి రాలేదు. అతని భార్యకు అతనంటే కొంచెంకూడా ఆదరణ లేదు. అయితే ఈ సంగతి ఆమె పైకి తెలియనివ్వలేదు. ఇంతలో అమిస్‌కు భయంకరమైన కుష్ఠు వ్యాధి సోకింది. ఆ వ్యాధికి చికిత్సలేదు.

తన భర్త అసహాయస్థితిలో ఉండటం చూసి అతన్ని మరింత శ్రద్ధగా చూడటానికి బదులు అతని భార్య అతన్ని దూరంగా ఒక గుడిసెలో ఉంచి, అతనికి సేవ చెయ్యటానికి నౌకర్లను కూడా సరిగా ఏర్పాటు చేయక, అతనికి సరి అయిన భోజనంకూడా లేకుండా చేసింది.

"నన్నెందుకు బాధిస్తున్నావు? నేనిక ఎంతో కాలం బతకను. బతికిన రెండు రోజులూ నాకు కాస్త మంచి భోజనమైనా పంపించు," అని అమిస్ తన భార్యకు కబురు చేశాడు.



"నీవు ఎంత త్వరగా పోతే నాకు పీడ అంత త్వరగా విరగడ అవుతుంది," అని ఆమె తన నౌకరు ద్వారా అతడికి సమాధానం పంపింది.

అమిస్‌కు విశ్వాసపాత్రులైన నౌకర్లు కొద్ది మంది లేకపోలేదు. కాని అమ్మగారి నోటికి వెరిచి వారు తమ యజమానికి ఏవిధమైన సహాయమూ చేయలేకపోయారు. అమిస్ నమ్మకస్తులైన నౌకర్లను ఇద్దరిని పిలిపించి, "నాయనలారా, నన్ను మంచంలో పెట్టి మోసుకుపోండి. నా భార్య కనికరించకపోతే నన్ను చూసి ప్రపంచమైనా కనికరిస్తుందేమో!" అన్నాడు.

నౌకర్లు తమ యజమానిని ఒక మం చంలో పడుకోబెట్టి, దాన్ని మోసుకుంటూ రహదారిన బయలుదేరారు. దారి వెంట ముష్టెత్తుకుంటూ అమిస్ తన మిత్రుడుండే ఊరికి వచ్చాడు.

తన ప్రాణ మిత్రుడు ఇటువంటి దౌర్భాగ్యపు స్థితిలో తన కళ్ళపడగానే అమిల్ అతన్ని కౌగలించుకుని, తన ఇంటికి తీసుకుపోయి, తన పక్కలో అతన్ని పడుకోబెట్టి, అహోరాత్రాలు అతనికి తానే స్వయంగా సేవచేస్తూ వచ్చాడు.

ఒకనాటి రాత్రి అమిస్‌కు విచిత్రమైన కల ఒకటి వచ్చింది. అందులో ఒక దేవత కనబడి, "అమిస్, నీ రోగం నయంచేసుకోవాలని ఉందా?" అని అడిగింది.

"తప్పకుండా ఉంది," అన్నాడు అమిస్.

"అలా అయితే, నీ స్నేహితుడి కొడుకులను చంపి వారి రక్తంతో స్నానం చెయ్యి. నీ వ్యాధి తప్పక నయమవుతుంది, అమిస్," అన్నది దేవత.

"అందుకు నేను చచ్చినా ఒప్పుకోను!" అని అమిస్ పైకే అనేశాడు. తన గొంతు విని అతను మేలుకున్నాడు.

అయితే అమిల్ మేలుకునే ఉండటం చేత తన మిత్రుడు పైకి అన్నమాటలు విని,



"దేనికి ఒప్పుకోనంటున్నావు, అమిస్," అని అడిగాడు.

"ఏదో కలలే!" అన్నాడు అమిస్.

"ఆ కల ఏమిటో నాక్కూడా కాస్త చెప్పు," అన్నాడు అమిల్.

అతను ఒత్తిడి చేసిన మీదట అమిస్ కలలో తనకు దేవత చెప్పిన మాటలు చెప్పేసి, "ఏమైనా ఇది నిజం కాదు, కలే!" అన్నాడు.

అమిల్ చల్లని మాటలతో అమిస్‌ను నిద్రపుచ్చాడు. అతను తూర్పు తెల్లవారే దాకా ఆలోచిస్తూ కూచుని, ఆ తరవాత తన భార్యా, కొడుకులూ నిద్రపోతున్న చోటికి వెళ్ళి, భార్యను లేపి, "నీవు ఆలయానికి వెళ్ళి మన స్నేహితుడు అమిస్ కోసం ప్రార్థన చేసి రా!" అన్నాడు.

ఆమె ఆలయానికి బయలుదేరి వెళ్ళగానే అమిల్ కత్తి తీసుకుని, నిద్రలో ఉన్న తన కొడుకు లిద్దరి తలలూ నరికి, వారి రక్తం తెచ్చి అమిస్ శరీరమంతా పూసాడు. మరుక్షణమే అమిస్‌ను బాధిస్తున్న కుష్ఠురోగం మంత్రించినట్టుగా మాయమై పోయింది. అమిస్ కలలో దేవత చెప్పిన మాట అక్షరాలా నిజమయింది.

అమిల్ తన మిత్రుడితో, "భగవంతుడి అనుగ్రహంచేత నీ వ్యాధి నివారణ అయింది.



మనం ఆలయానికి వెళ్ళి దేవుణ్ణి ధ్యానించి వద్దాం పద!" అన్నాడు. అతను అమిస్‌కు తన వద్ద ఉండే ఉడుపులలో ఉత్తమమైనవి తీసి కట్టుకోను ఇచ్చి అతనితో సహా ఆలయానికి బయలుదేరాడు.

వారు ఆలయానికి చేరే సరికి అమిల్ భార్య బయటికి వస్తూ కనిపించింది. స్నేహితులిద్దరూ దేవుడికి దణ్ణాలు పెట్టుకున్నాక ఆమె వారితో సహా ఇంటికి తిరిగి వచ్చి, తన భర్తతో, "మన మిత్రుడి వ్యాధి ఎలా నయమయింది?" అన్నది.

అమిల్ జరిగినదంతా ఆమెకు చెప్పాడు. ఆమెకు దుఃఖం పొంగి వచ్చింది. కాని దాన్ని బలవంతాన అణచుకుని, "నాతో ముందుగా చెప్పకపోయారా? నేను కూడా దగ్గిర ఉండేదాన్ని గద! ఆయన ఒకప్పుడు మనకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేసే అవకాశం ఎప్పుడు వస్తుందా అనుకుంటుంటే ఇప్పుడు వచ్చింది!" అన్నది.

పైకి ఇలా అన్నదేగాని తన కొడుకులను తలుచుకుని ఆమెకు దుఃఖం ఆగలేదు. తన భర్త ముఖం చూడటం కూడా ఆమెకు బాధ కలిగించింది. అందుచేత ఆమె తన బిడ్డలు పడుకునే గదికేసి పరిగెత్తింది. అయితే అక్కడ తన కళ్ళబడే భయంకర దృశ్యం గురించి ఆమెకు మనసులో భయంగానే ఉంది.

కాని ఆ గదిలోకి అడుగు పెట్టగానే ఆమెకు భయం కలగటానికి బదులు ఆశ్చర్యం కలిగింది. ఆమె కొడుకు లిద్దరూ మంచంలో లేచి కూచుని ఏవో ఆటలు ఆడుతున్నారు! వారి కంఠాల చుట్టూ ఎర్రటి గీరలు మాత్రం ఉన్నాయి.

ఆ నాడు ఆ ఇంట ఒకే గడియలో రెండు దివ్యాద్భుతాలు జరిగాయి—చికిత్సే లేని కుష్ఠువ్యాధి నుంచి అమిస్ విముక్తుడయాడు; చచ్చిపోయిన కుర్రాళ్ళిద్దరూ తిరిగి బతికారు.





# తెలివిగల ఇల్లాలు ★

[రామతీర్థ కథ]

యాజ్ఞవల్క్యుడికి కాత్యాయనీ, మైత్రేయీ అని ఇద్దరు భార్యలు. ఆయన చాలా ధనసంపన్నుడు. ఆయనకు ఐహిక సుఖాలను విడిచి అరణ్యంలో తపస్సు చేసుకుని తరించాలన్న కోరిక కలిగింది. అప్పుడాయన తన ఆస్తి యావత్తూ రెండు భాగాలు చేసి తన ఇద్దరు భార్యలనూ తీసుకోమన్నాడు.

మైత్రేయి తెలివి గలది కావటం చేత ఈ విధంగా ఆలోచించింది: "నా భర్త సిరిసంపదల నన్నిటినీ విడిచి పెట్టి అరణ్యానికి వెళ్లటం దేనికి? అందులో హెచ్చు ఆనందం ఉండబట్టే గద! ఎవరైనా ఆనందమయమైన జీవితాన్ని బుద్ధిపూర్వకంగా వదిలేసి కష్టాలనే వెతుక్కుంటూ పోతారా?"

ఇలా అనుకుని మైత్రేయి తన భర్తతో, "ఏ జ్ఞానం చేత మీరు ఈ ఐశ్వర్యాన్ని వదిలేసి పోతున్నారో దాన్ని నాకూడా చెప్పండి. నాకు ధనం అక్కర్లేదు," అన్నది. కాత్యాయనికి యాజ్ఞవల్క్యుడి సొత్తంతా సంక్రమించింది, కాని మైత్రేయి తన భర్త నుంచి తత్వజ్ఞానం సంపాదించుకున్నది.





# ఇల్లు పట్టిన భూతం

ఒక ఊళ్ళో మల్లయ్యా అనే గాజుల వర్తకు డుండేవాడు. అతను ఊరి చివరని పెద్ద స్థలంలో చిన్న పూరి యిల్లు కట్టుకుని, అందులో తన భార్యా బిడ్డలతో కాపరం ఉండేవాడు. ఈ స్థలమూ, ఇల్లూ, కాక గాజుల మల్లయ్యాకు గల ఆస్తి ఒక అవూ, దూడా, కోళ్ళూనూ.

మల్లయ్యా రోజూ ఉదయాన్నే లేచి, ఆవుకు పాలు తీసి, గడ్డి వేసి, చద్ది అన్నం తిని, మధ్యాన్నానికి అన్నం మూట గట్టుకుని గాజుల బేరం మీద బయలుదేరేవాడు. సాయంకాలందాకా ఆ పల్లే ఈ పల్లే తిరిగి, చీకటి పడి ఇంటికి చేరుకునేవాడు.

ఒక రోజు గాజుల మల్లయ్యా ఒక మర్రి చెట్టు దగ్గిరికి చేరేసరికి మధ్యాన్నమయింది. దగ్గిరల్లోనే బావికూడా ఉన్నది. మల్లయ్యా తన మలారం చెట్టు కింద దింపుకుని, చెంబుతో నీళ్ళు తెచ్చుకుని, తన అన్నం మూట విప్పి, తిన్నంత తిని, మిగతాది ఏ కుక్కలో తినేస్తాయి గదా అని చెట్టు కిందనే వదిలేసి, మలారం భుజాని కెత్తుకుని ముందుకు సాగిపోయాడు.

మల్లయ్యా కదిలాడో లేదో ఒక బ్రహ్మ రాకసి అటుగా వచ్చింది. అది లోగడ ఉంటూ వచ్చిన చెట్టు పడిపోవటం చేత, కొత్త నివాసం ఏర్పాటు చేసుకునేటందుకు అది ఈ మర్రి చెట్టును చూసి వచ్చింది. దానికి గాజులమల్లయ్యా వదిలిపెట్టిన అన్నం కనిపించింది. బాగా ఆకలిగా ఉండటాన అది ఆ అన్నమూ, పచ్చళ్ళూ అవురావురు మంటూ తినేసింది.

అంతవరకూ బ్రహ్మరాకసి పచ్చి మాంసమూ, పచ్చి నెత్తురూ తప్ప రుచి చూడ లేదు. ఇప్పుడు దానికి మనుషులు తినే ఆహరం ఎంత రుచిగా ఉంటుందో తెలిసి వచ్చింది. ఇలాటి తిండే తింటూ

త్రిపురారి సత్యనారాయణ

మనిషిలాగా బతకాలన్న కోరిక దానికి కలిగింది. గాజుల మల్లయ్య కోసం ఎదురు చూస్తూ అది అక్కడే ఉండిపోయింది.

ఆ రోజుకు బేరం ముగించుకుని మల్లయ్య ఆ దారినే తిరిగి వస్తూ, మర్రి చెట్టు దగ్గిర మలారం దించి బావి దగ్గిర మంచి నీళ్ళు తాగుతూ ఉండగా ఎవరో ఆడకూతురు ఏడుస్తున్న ధ్వని వినిపించింది. మల్లయ్య తల తిప్పి చూసే సరికి చెట్టు మొదట ఒక ఆడ మనిషి కూచుని ఏడుస్తూ ఉండటం కనపడింది.

"ఎవరమ్మా నువ్వు? ఇక్కడ ఒంటరిగా ఏడుస్తున్నా వెందుకు?" అని మల్లయ్య అడిగాడు.

"మాది చాలా దూరం, బాబూ! నా భర్త ఏటో వెళ్ళి పోయాడు. అతణ్ణి వెతుక్కుంటూ తిరుగుతున్నాను. తిండీ తిప్పలూ లేక బాధ పడుతున్నాను," అన్నదా స్త్రీ.

"అయ్యో, పాపం! మా ఇంటికి వచ్చి పని సహాయంగా ఉండు. జీతం ఏమీ ఇవ్వలేను గాని కడుపునిండా తిండి పెడతాను. నీ భర్త జాడ తెలిస్తే వెళ్ళిపోదువుగాని," అన్నాడు మల్లయ్య.

బ్రహ్మరాక్షసికి కావలిసింది కూడా అదే గనక, "బాబూ, నా చేతనైన పని ఏదన్నా



చెప్పి చేయించుకోండి. చేతగాని పని చెబితే మాత్రం నేను మీ ఇంట ఒక్క క్షణం ఉండను. ఎందుకైనా మంచిది, ముందే చెబుతున్నాను," అన్నది.

సరే నని మల్లయ్య ఆడమనిషి రూపంలో ఉన్న ఆ బ్రహ్మరాక్షసిని తన వెంట తీసుకెళ్ళాడు. అతని భార్య ఆ మనిషి వృత్తాంతమంతా భర్త నుంచి విని, "నీ పేరేమమ్మా?" అని అడిగింది.

"నా పేరు దయ్యమ్మ," అన్నది బ్రహ్మరాక్షసి తడుముకోకుండా.

సరే మర్నాటినుంచి దయ్యమ్మ మల్లయ్య ఇంట పని ప్రారంభించింది. పొద్దున్నే లేచి

వాకిళ్ళు ఊడ్చి, నీళ్ళు చల్లేది. మల్లయ్య పాలు తీయగానే ఆవునూ, దూడనూ తీసుకు పోయి మధ్యాన్నందాకా మేపు కొచ్చేది. మిగిలిన రోజల్లా మల్లయ్య భార్యకు అన్ని పనులలోనూ సహాయం చేసేది. దయ్యమ్మ రావటంతో మల్లయ్యకూ, అతని భార్యకూ కూడా బోలెడంత విశ్రాంతి దొరికింది. ఆమెను అందరూ ఆదరంతో చూసేవారు.

కొంతకాలం గడిచింది. సంక్రాంతి రోజులు వచ్చాయి. పగలు పొద్దు తక్కువ, బేరం బాగా సాగుతున్నది. అందుచేత 'ఒక నాటి రాత్రి మల్లయ్య చాలా పొద్దుపోయి ఇంటికి వచ్చి తలుపు తట్టాడు. అప్పటికే ఇంటిల్లిపాతీ అన్నాలు తిని, చలికి ముసుగులు తన్ని పడుకున్నారు. మల్లయ్య భార్య మంచం మీద పడుకున్నది. దయ్యమ్మ నేల మీద చాప వేసుకుని పడుకుంది.

మల్లయ్య భార్య ముసుగులో నుంచి బయటికి రావటం ఇష్టంలేక, "ఆయన వచ్చినట్టుంది, కాస్త తలుపు తియ్యి, దయ్యమ్మా!" అన్నది.

దయ్యమ్మ ఒక్క మూలుగు మూలిగి, చాపమీద పడుకుని ఉండే, చెయ్యి పొడుగు చాచి తలుపు గడియ తీసింది. ఇది కాస్తా మల్లయ్య భార్య కంట పడింది. ఆమె పై ప్రాణాలు పైనే పోయినంత పని అయింది.



ఆమె తన భయాన్ని ఎలాగో అణచుకుని, మర్నాటి ఉదయం రాత్రి జరిగిన విడ్డూరం గురించి తన భర్తతో చెప్పేసి, "ఇది మనిషి కాదు. దానిపేరే విడ్డూరం! దయ్యమ్మ అని ఎవరన్నా పేరు పెట్టుకుంటారా?" అన్నది.

మల్లయ్య తన భార్య మాటలు మొదట నమ్మలేదు. ఏదో భ్రమగాని, కలగాని అయి ఉంటుందన్నాడు. కాని తనకు కూడా లోపల అనుమానంగానే ఉన్నది. తాను లోపలికి వచ్చే సరికి దయ్యమ్మ చాప మీద పడుకునే ఉన్నది. తలుపు గడియ తీసి వెళ్ళి పడుకోవటానికి తగిన వ్యవధి లేదు. దయ్యమ్మ మనిషి అయినా కాక పోయినా తన భార్య భయపడుతున్నది గనక ఆమెను పంపెయ్యాలనే మల్లయ్య నిశ్చయించాడు. కాని అకారణంగా వెళ్ళి పొమ్మంటే మర్యాదగా ఉండదు; చేతగాని పని చెబితే పోతానని దయ్యమ్మ మొదటనే చెప్పింది. అందుచేత ఆమెను పంపటానికి మల్లయ్య ఒక ఎత్తు ఎత్తాడు.

ఆయన దయ్యమ్మతో, "చూడు, దయ్యమ్మా, మన ఇంటి చుట్టూ బోలెడంత ఆవరణ ఉన్నది. ఇందులో ఎన్నో చెట్లు వేసుకోవచ్చు. అయితే ముందుగా నిలువెత్తున ప్రహరీ గోడ కట్టాలి. కాస్త ఆ పని చూడు!" అన్నాడు.



దయ్యామ్మ అంత పని తనవల్ల కాదనక, సరే నని తానే మట్టి తవ్వి, ఇటుకలు చేసి కాల్చి, ఒంటరిగా ఆవరణ చూట్టూ ఎత్తయిన ప్రహరీ గోడ కట్టేసింది. ఆ తరవాత ఎక్కడెక్కడి నుంచో పెద్దపెద్ద చెట్లు తెచ్చి ఆవరణ అంతటా పాతి తోట తయారు చేసింది.

దయ్యామ్మ మామూలు మనిషి కాదని మల్లయ్యకు రూఢి కావటమేగాక ఊళ్ళో వాళ్ళందరికీ కూడా తెలిసిపోయింది. ఈ దయ్యామ్మను ఎలా వదుల్చుకోవాలో మల్లయ్యకు పాలుబోలేదు. దయ్యామ్మ ఎవరికీ ఏ అపకారమూ చెయ్యటంలేదు, నిజమే. కాని అటువంటి మనిషి ఇంట ఉండటం ఎంత ప్రమాదం! ఊళ్ళో వాళ్ళంతా, "ఆ దయ్యం ముండను వెళ్ళగొడతావా, లేక నువే ఊరు విడిచి పోతావా?" అని అతన్ని అడుగుతున్నారు. మల్లయ్య ఇంటి చుట్టూ అస్తమానం జనం మూగుతున్నారు. ధైర్యం గల వాళ్ళు దయ్యామ్మను చూడటానికి లోపలికి కూడా వస్తున్నారు.

ఒకనాడు మల్లయ్య కుటుంబమంతా ఆవరణలో ఉండగా ఒక పిల్లి ఒక ఎలుకను తరుముకుంటూ వచ్చింది. ఎలుక పరిగెత్తుకుంటూ వెళ్ళి ఒక సన్నటి కలుగులో దూరింది.

ఇదంతా చూస్తున్న మల్లయ్య కొడుకు, పసివాడు, "దయ్యామ్మా, దయ్యామ్మా! ఆ ఎలుకను తీసుకురా!" అని అడిగాడు.

"ఏం? నాకు చాతకాదనుకున్నావా?" అంటూ దయ్యామ్మ అందరూ చూస్తుండగానే ఎలుకంత చిన్నదైపోయి కలుగులోకి దూరింది.

ఇదే సమయమనుకుని మల్లయ్య గంపెడు మట్టి తెచ్చి ఆ కలుగును పూడ్చేశాడు. అంతే, ఆ తరవాత దయ్యామ్మను ఎవరూ చూడలేదు.






# కొత్త నౌకరి

షావుకా రిచ్చిన పావలా జేబులో వేసుకుని భీమన్న నడక సాగించాడు. వాడు అడవి దారినపడి పోతూండగా చీకటి పడింది. ఆ చీకటిలోనే వాడు నడుస్తూ కొంత దూరం వెళ్ళాక వాడికి కొందరు మనుషులు, నెత్తిన మూటలు పెట్టుకుని ఎదురు వచ్చారు.

వారు నగల వర్తకులు. అడవికి అవతల ఉండే గ్రామంలోని వాళ్లు. ఆ గ్రామం మీద దొంగలు పడగా, ఈ నగల వర్తకులు తమ వద్ద ఉండే వెండి బంగారాలతో పారిపోయి వస్తున్నారు. నగల వర్తకులు ఆ రాత్రికి అడవిలోనే ఉండి పోదలిచారు.

వాళ్ళు భీమన్నను చూసి, "అబ్బాయీ, నువు ఎక్కడికి పోతున్నావో. అవతల ఊళ్లో దొంగలు పడ్డారు. మేం అక్కడినుంచే పారి పోయి వస్తున్నాం. ఈ రాత్రికి మే మిక్కడే పడుకో దలిచాం," అన్నారు. "మీ రెవరు?" అని భీమన్న అడిగాడు.

"మేము నగల వర్తకులం. మేమీ చెట్ల మీద ఎక్కి పడుకుంటాం. నువు కాస్త కని పెట్టి ఉన్నావంటే నీకు కొంత ముట్ట జెప్పుతాం," అన్నారు వారు.

"మీరు చెట్లెక్కండి, నేను మాత్రం కిందనే పడుకుంటాను," అన్నాడు భీమన్న.

"పురుగూ పుట్రా వస్తే?" అన్నారు నగల వర్తకులు.

"చంపేస్తాను. మరేం భయం లేదు. మీరు మాత్రం నిద్రలో కింద పడిపోకుండా జాగ్రత్త పడండి," అన్నాడు భీమన్న.

"భలేవాడు! గట్టివాడు! ధైర్యశాలి!" అని భీమన్నను మెచ్చుకుంటూ నగల వర్త కులు చెట్లెక్కి, తమ మూటలను చెట్టు కొమ్మలకు తగిలించి, తాము పడిపోకుండా గట్టిగా కొమ్మలకు కట్టుకుని నిద్రపోయారు.

భీమన్నమటుకు చెట్టు మొదలుకు చేర గిలబడి అలాగే నిద్ర పోయాడు.

ఒక రాత్రివేళ దొంగలు బారుగా నడుస్తూ అటుగా వచ్చారు. ముందు నడిచే దొంగ భీమన్న కాలు తగిలి పడిపోతూ, "కొంచెం ఎడంగా రండి. ఇక్కడ ఏదో దుంగ అడ్డంగా ఉంది," అన్నాడు.

దొంగ కాలు తగలగానే భీమన్న మేలుకున్నాడు. వాడు కోపంగా, "ఏమయ్యోయ్, నన్ను దుంగ అంటావా? నీకు కళ్ళు లేవూ?" అంటూ లేచి నిలబడ్డాడు.

"ఓహెూ, మనిషివా? అయితే నీ దగ్గిర ఉన్నదంతా ఇచ్చెయ్యి. లేకపోతే చంపేస్తాము," అన్నాడు దొంగ.

"ఇస్తాను. కాని మీరెవరు?" అన్నాడు భీమన్న.

"దొంగలం! ఊఁ, నీ దగ్గిర ఉండేదంతా పైకి తియ్యి," అన్నారు దొంగలు.

"మీరేనా దొంగలంటే. సరే, ఈ పావలా తీసుకోండి. నా దగ్గిర ఇంతకన్న ఇంకేమీ లేదు," అంటూ భీమన్న తన దగ్గిర ఉన్న పావలా వాళ్ళకిచ్చేశాడు. వాళ్ళు తమ దారిన బయలుదేరారు.

వాళ్ళు కొంతదూరం వెళ్ళాక భీమన్న, "ఏమండోయ్, దొంగలూ!" అని వెనక్కు పిల్చి, "ఆ పావలా నా కొక షావుకారిచ్చాడు. అది ఒకవేళ పూటా పావలా అయితే తరవాత నన్ని ఏమీ లాభంలేదు. ఈ చెట్ల మీద నగల వర్తకులున్నారు. వాళ్ళకు చూపిస్తే ఆ పావలా మంచిదయిందీ, పూటా అయిందీ చెబుతారు!" అన్నాడు.

"నగల వర్తకులు" అన్న మాట చెవిని పడగానే దొంగలకు ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. వాళ్ళు చెట్లన్నీ ఘాలించి, నగల వర్తకుల నందర్నీ చితక తన్ని వారి మూటలు కాజేశారు. వాళ్ళు భీమన్నతో, "నువ్వు మాతో చేరిపో. నీకు దొంగతనం నేర్పిస్తాం. సుఖంగా బతకవచ్చు!" అన్నారు.

"ఓ, అలాగే చేరుతాను. నా కెక్కడైనా ఒకటే," అన్నాడు భీమన్న దొంగలతో.






తండ్రిని ఆ స్థితిలో చూడగానే రాముడికి పామును తొక్కినట్టుగా భయం కలిగింది. అతను కళవళపడి కైకేయితో, "అమ్మా, నా వల్ల ఏదైనా తప్పు జరిగిందా? తండ్రిగారు ఇలా కలవర పడటానికి కారణమేమిటి? ఆయనను ఇలా ఎన్నడూ చూడలేదు. నాకేమో ఆందోళనగా ఉన్నది," అన్నాడు.

కైకేయి కొంచెంకూడా బిడియం లేకుండా, "రాజుగారికి కోపమూ లేదు, తాపమూ లేదు. ఆయనకు ఒక కోరిక ఉన్నది. అది నీకు చెప్పటానికి జంకుతున్నాడు. ఒకప్పు డీయనగారు నాకు ఒక వర మిస్తానన్నాడు. ఎందుకన్నానా అని ఇప్పుడు కుళ్ళుతున్నాడు. ధర్మం జరగటం ప్రధానం కద. నీ తండ్రి ఆడినమాట తప్పకుండా చూసేభారం నీమీద ఉన్నది. మంచో, చెడో, ఆయన కోరిక తీర్చుతానని నీవు మాట ఇస్తే అసలు సంగతి చెబుతాను. ఆ సంగతి ఆయన నోటంట రాదు, అందుచేత నేనే చెప్పాలి మరి," అన్నది.

"అదేమిటమ్మా? నన్నలా శంకించవచ్చా? నాయనగారు కోరితే నిప్పులో దూకనా? ఆయన కోరిక ఏమిటో చెప్పు, తప్పక చేస్తాను. నేను ఆడి తప్పను," అన్నాడు రాముడు.

కైక రాముడితో దేవాసుర యుద్ధం నాటి విషయాలుచెప్పి, ఆయన ఆ సమయంలో ఇస్తానన్న వరం ప్రకారం రాముడు పద్నాలుగేళ్ళు అరణ్యవాసానికి పోవలసి ఉంటుందని చెప్పింది.



"ఈ పట్టాభిషేక యత్నం వృథాపోదులే. భరతుడు పట్టాభిషేకం చేసుకుని భూమి నాలుగు చెరగులా పాలిస్తాడు. నీవు నారబట్టలూ, జడలూ ధరించి పద్నాలుగేళ్ళు అరణ్యవాసం వెళ్ళినట్టయితే నీ తండ్రికి ఆడి తప్పాడన్న అపఖ్యాతి చుట్టుకోకుండా పోతుంది," అన్నదామె.

ఇంత దారుణమైనమాట, ఇంత పరుషంగా చెవిని పడినప్పుడు మరొకడైతే ఎంతో కలవరపడి, మథనపడి, కైకేయి మొహం చూడడానికికూడా సిగ్గుపడి ఉండును. కాని రాముడటు వంటి వికారాలేమీ లేకుండా, "అమ్మా, అలాగే కాని. నేను నారబట్టలు



కట్టి అరణ్యానికి పోతాను. భరతుడి కోసం వెంటనే కబురు పంపండి. తండ్రిగారి ప్రతిజ్ఞా, నీ కోరికా ఇదే అయినప్పుడు నేను భరతుడికి రాజ్యం ఇవ్వనంటానా? భరతుడికి పట్టంకట్ట నిశ్చయించానని తండ్రిగారు నాతో అనకపోవటమే నన్ను బాధిస్తున్నది," అన్నాడు.

ఈ మాటలకు కైకేయి సంతోషించి, "మరేం లేదులే. ఆయన మాట దక్కిస్తావో, దక్కించవో అనే జంకుచేతనే ఆయన నీతో ఈ సంగతి చెప్పలేదు. నువ్వు మాత్రం జాగు చేయక అడవికి బయలుదేరు. నీవు వెళ్ళేదాకా మీ తండ్రిగారు స్నాన భోజనాదులు చెయ్యడు," అన్నది.

కైకేయి అన్న ఈ మాటలకు దశరథుడు లోలోపల కుమిలి మూర్ఛపోయాడు. రాముడాయనను లేవదీసి కూచోబెట్టి కైకేయితో, "అమ్మా, నాకు లోపల నిజంగా రాజ్యకాంక్షా, ధనకాంక్షా లేవు. నే నింకేమైనా చేయవలసినది ఉంటే చెప్పు. నీవు రాజుగారిని కోరిన వరాలు చాలా అల్పమైనవి. నీవు నిజంగా కొండనుతవ్వి ఎలుకను పట్టుకున్నావు," అన్నాడు.

దశరథుడు బావురుమని ఏడ్చి స్పృహ తప్పి పడిపోయాడు. రాముడు తండ్రికీ,



కైకేయికీ ప్రదక్షిణ నమస్కారంచేసి అంతఃపురం నుంచి బయిటికివచ్చి తన చెలికాళ్ళ కేసిచూసి, పట్టాభిషేక సంబారాలకు ప్రదక్షిణం చేసి బయలుదేరాడు. లక్ష్మణుడు ఆపుకోరాని దుఃఖంతోనూ, ఆగ్రహంతోనూ పెనుగులాడుతూ అన్నను వెంబడించాడు.

రాముడు రథమెక్క లేదు. ఛత్రచామరాలు నిషేధించాడు. సర్వసంగ పరిత్యాగం చేసిన యోగియొక్క మనస్థితి తెచ్చి పెట్టుకుని, ఈ దుర్వార్త చెప్పటానికి కౌసల్యమందిరానికి బయలుదేరాడు. దశరథుడి అంతఃపుర స్త్రీలు గొల్లున ఏడవటం వినపడింది.

రామలక్ష్మణులు కౌసల్యసగర్భుకు వచ్చేసరికి అక్కడ ఎవరికీ జరగబోయేది తెలియదు. రాముడు మొదటి ప్రాకార ద్వారం నుంచి లోపలికి పోతూంటే, అక్కడ ఉండిన ఒక వృద్ధుడూ, మరికొందరూ లేచి నిలబడి విజయధ్వానాలు చేశారు. రెండవ ప్రాకారం వద్ద ఉండే వృద్ధ బ్రాహ్మణులకు నమస్కరించి, మూడో ప్రాకారం చేరాడు. అక్కడి కాపలివాళ్ళంతా స్త్రీలు. వారిలో కొందరు కౌసల్యతో రామలక్ష్మణుల రాక చెప్పటానికి పరిగెత్తారు; మిగిలినవాళ్ళు, "మహారాజుకు జయం కలగాలి!" అని కేకలు పెట్టారు.



రాముడు వచ్చేసరికి కౌసల్య అగ్నిలో హోమం చేస్తున్నది. ఆమె రాముడి కెదురు వచ్చి, కౌగలించుకుని, శిరస్సు ముద్దు పెట్టుకుని, "నాయనా, భోజనం చేద్దువు గాని పద!" అన్నది.

తల్లికి ఈ విషాదవార్త ఎలా తెలపాలో తెలియక తికమకపడుతూ రాముడు, "అమ్మా, నీ కింకా తెలియదులాగుంది. అంతా తారుమారై పోయింది. నేను పద్నాలుగేళ్ళు మునిలాగా, మాంసం వర్జించి, కంద మూల ఫలాలు తింటూ దండకారణ్యంలో ఉండబోతున్నాను. నేను కూచునేది సింహాసనం మీద కాదు, దర్భల చాప మీద.



నాన్నగారు భరతుడికి పట్టంగట్టబోతున్నారు," అన్నాడు.

ఈ మాట విని కౌసల్య మొదలు నరికిన అరటి చెట్టులాగా పడిపోయి నేలపై దుఃఖంతో పొర్లింది. రాముడామెను లేవదీసి కూచోబెట్టి దుమ్మంతా దులిపాడు. కౌసల్య రాముడితో, "నాయనా, నా జన్మకు సుఖం లేదు కాబోలు. నిన్ను కని ఈ బాధ భరించేకన్న గొడ్రాలుగానే ఉండిపోయినట్టయితే, పిల్లలు లేరన్న చింత ఒక్కటే బాధించేది. ఎన్నడూ నేను సుఖపడి ఎరగను; నీవు రాజువైతే సుఖపడదామనుకుంటున్నాను. కావటానికి నేను రాజుగారి



పెద్ద భార్యనే కాని, సవతుల చేత పడరాని మాటలన్నీ పడ్డాను. ఏమంటే నా భర్తకు నేనంటే లక్ష్యంలేదు, నాకు స్వాతంత్ర్యమూ లేదు. ఇక నేను కైకేయి పరిచారికలకంటె హీనంగా బతకాలి. నీవు పుట్టిన ఈ పదిహేడేళ్ళూ నీ వెప్పుడు రాజువవుతావా అని ఎదురు చూస్తూ వచ్చాను. ఆ ఆశకూడా పోయింది. నాకు చావు వచ్చినా బాగుండును, కాని అది కావాలన్నప్పుడు రాదు. నాయనా, నేనుకూడా నీ వెంటనే అడవులకు వస్తాను," అన్నది.

కౌలస్య మాటలు వింటుంటే లక్ష్మణుడికి ఒక ఆలోచన వచ్చింది. అతడు కౌసల్యతో, "అమ్మా, ఆ కైకేయి మాట విని అన్న అడవికి పోవటం నాకు సవ్యంగా కనపడలేదు. రాజు ముసలివాడు, ఆయన మనసు దుర్బలమైనది. స్త్రీ వ్యామోహంచేత ఆయన అన్యాయమైన పని చెయ్యమంటే కొడుకులమైన మేము చేయాలని ఎక్కడ ఉంది?" అని, రాముడితో, "అన్నా, రాజు నిన్ను అడవికి పొమ్మన్నమాట అందరికీ తెలియక ముందే మనం మన శౌర్యంతో రాజ్యాన్ని వశపరుచుకుందాం. నేను విల్లుపట్టి మనని నిరోధించే వాళ్ళందరినీ చంపుతాను. మన తండ్రికూడా మనకు పగవాడే అయినాడు.







ఆయనను చంపినా, కాళ్ళూ చేతులూ కట్టి పడవేసినా తప్పులేదు. మా అందరిలోనూ పెద్దవాడవు. ఈ రాజ్యం నీది? రాజు మాత్రం దీన్ని మరొకరికి ఎలా ఇస్తాడు? నీవేమి అపచారం చేశావని నిన్ను అడవులకు పంపుతాడు? నిన్ను అడవులకు పంపే టంత శక్తిమంతుడా ఈ రాజు? ఇదుగో నా విల్లు! నేను యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

కౌసల్య రాముడితో, "నాయనా, లక్ష్మణుడు చెప్పినట్టు చెయ్యి. నీవు నీ తండ్రి మాటే వినాలని ఏమున్నది? నేను తల్లిని కానా? నీవు అడవులపాలు కావటానికి నేను ఒప్పను. ఒకవేళ వెళ్లావో ఉపవాసాలు చేసి ప్రాణాలు విడుస్తాను. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది," అన్నది.

రాముడు తల్లితో, "నేను నాన్నగారి మాట అబద్ధం చేయలేను, జవదాటలేను. పితృవాక్యం పాలించటానికి ఎందరో ఘోరాలు చేశారు. కండుడు అనే ముని గోవధ చేశాడు. పరశురాముడు తల్లినే చంపాడు. మా మూల పురుషుడైన సగరుడి కొడుకులు తండ్రి ఆజ్ఞపై పాతాళానికి పోయి, అరవైవేలమందీ ఒక్కసారిగా మరణించారు. అమ్మా, నేను నిన్ను ధిక్క రించటానికి అరణ్యానికి పోతున్నానా?" అని, లక్ష్మణుడితో, "లక్ష్మణా, నీకు నాపై గల ప్రేమా, నీ పౌరుషమూ నేనెరగనా? అన్నిటికన్న ధర్మం గొప్పది. దానిని మనం నిలబెట్టాలి. అందుచేత నా బుద్ధి నను సరించే నీవు కూడా ఆలోచించు," అన్నాడు.

తల్లిని సమాధాన పరచటానికి రాముడు ఎన్నో ధర్మాలు చెప్పాడు. కౌసల్య ముసలి భర్తను విడిచి తన వెంట రావటం భావ్యం కాదన్నాడు. అతను లక్ష్మణుడితోకూడా, "ఇది దైవ నిర్ణయం. కాకపోతే, నేనంటే అంత ప్రేమగా ఉండే కైకేయి నన్ను అడవులకు పొమ్మంటుందా? పట్టాభిషేకం



నిలిచి పోయిందంటే నీ కింత భాధగా ఉన్నదే, పట్టాభిషేకం జరుగుతున్నదని తెలిసి ఆమె ఎంత బాధ పడిందో? నేను తండ్రిగారి మనసుగాని, ఆమె మనసుగాని నొప్పించినట్టు నాకు జ్ఞాపకం లేదు. ఇప్పుడా పని చేయలేను," అని చెప్పాడు.

రాముడు తండ్రి అజ్ఞ పాలించటానికి గాను అడవికి వెళ్ళే దృఢనిశ్చయం చేసుకున్నాడని గ్రహించి, కౌసల్య అతని క్షేమం కోసం బ్రాహ్మణుల చేత హోమం చేయించి, ఆశీర్వదించి పంపింది.

రాముడు సీతయొక్క అంతఃపురానికి వెళ్ళాడు. అతనికి సీతను చూడగానే కన్నీరు ఆగలేదు. పట్టాభిషేకం చేసుకునే ఉత్సాహంలేకపోగా, తల వంచి కన్నీరు కార్చుతూ, వెంట ఎవరూ లేకుండా వచ్చే భర్తను చూసి సీతకూడా కంపించింది. ఆమె అతని దిగులుకు కారణ మడిగింది.

జరిగినదంతా చెప్పి రాము డామెతో, "నేను అడవుల నుంచి తిరిగి వచ్చేవరకూ నీవు భరతుడి వద్ద ఉండి అతను చెప్పేనట్టు నడచుకో. అతని ఎదట నన్నెప్పుడూ పొగడకు. బంధుత్వం తప్పిస్తే, భరతుడు నిన్ను పోషించ వలసిన కారణం మరొకటి లేదు. అందుచేత నీవు అతను సంతోషించేటట్టు మసలుకో. వృద్ధులైన నా తల్లి దండ్రులను కనిపెట్టి ఉండు," అని చెప్పాడు.

ఈ మాటలు విని సీత, ప్రణయంతో కూడిన కోపంతో, "ఇవేం మాటలు? నన్ను తేలిక జేసి పరాచకాలాడుతున్నావా? ఆడదానికి భర్తే కదా గతి! నిన్ను వనవాసం వెళ్ళమంటే నన్ను వెళ్ళమన్నట్టు కాదా? నీవు అడవిలో సంచరించటమే జరిగితే, ముళ్ళన్నీ నా కాళ్ళతో తొక్కి నీకు దారి చేస్తూ నేను ముందు నడవనా? నీ వంటి పరాక్రమవంతుడి వెంట ఉండగా నాకు అరణ్య భయం ఉండబోదు. అడవిలోని వారందరినీ కాపాడగల వాడివి నన్ను

కాపాడలేక పోవు. అడవిలో నేను, అది కావాలి, ఇది కావాలి అని అడగబోను. నీవు లక్ష చెప్పినా సరే నా మనసు మారదు," అన్నది.

సీత తన వెంట అడవులకు వచ్చి కష్టాలు పడటం రాముడికి కొంచెం కూడా ఇష్టం లేదు. ఆ కష్టాలను వివరించి చెప్పాడు. కాని సీత వాటిని లక్ష్యపెట్టలేదు. "నిన్ను చూసి సాముద్రిక వేత్తలు వన వాస యోగం ఉన్నదని చెప్పినట్టే నన్ను చూసికూడా జ్యోతిష్కులు నాకు వనవాస యోగం ఉన్నదని చెప్పారు. అందుచేత నేను నీ వెంట అరణ్యానికి వచ్చి తీరు తాను," అన్నది.

అప్పటికీ రాముడు ఆమెను తీసుకు పోవటానికి సమ్మతించలేదు. సీతకు కోపమూ, దుఃఖమూ ముంచుకు వచ్చాయి. ఆమె రాముడితో, "అయ్యో, మా నాన్న అయిన జనకమహారాజు, తన అల్లుడు పురుషరూపంలో ఉన్న ఆడదని తెలిస్తే ఏమనుకుంటాడు? నిన్ను శూరుడని తెలియనివారు అనుకుంటున్నారు! నీ భయం దేనికి? నేనేం తప్పు చేశానని నన్ను విడిచి పెట్టి పోవాలనుకుంటున్నావు? నీవు తప్ప నాకు వేరే దిక్కు లేదు గదా, నేను నిన్ను విడిచిపెట్టి వంశానికి కళంకం తీసుకు రావాలా? నీ వున్న చోటే నాకు స్వర్గమని చెప్పానే!" అంటూ బోరున ఏడ్చింది.

రాముడామెను రెండు చేతులా దగ్గిరికి తీసుకుని, సముదాయించి, తన వెంట తీసుకు పోతానని మాట ఇస్తూ, "వనవాసానికి సిద్ధంకా! నీ వద్ద ఉన్నదంతా దానం చేసెయ్యి. నీ వస్తు సామగ్రి యావత్తూ ముందు పనివాళ్ళ కిచ్చి, మిగిలినది బ్రాహ్మణుల కియ్యి. సన్యాసులకు భోజనం పెట్టించు, బిచ్చగాళ్ళకు దానాలు చేయించు," అన్నాడు. సీత పరమానందంతో ఆ పనులన్నీ సాగించింది.



# కమకురా బుద్ధవిగ్రహం

ఇది జపానులో కమకురా వద్ద ఉన్నది. దీనిని క్రీ. శ. 750 లో, ఒక అంగుళం మందంగల పోత కంచురేకులతో నిర్మించారు. దీని నుదురు వెండితోనూ, కన్నులు బంగారంతోనూ చేశారు. దీని ఎత్తు దాదాపు 50 అడుగులు, చుట్టుకొలత 97 అడుగులు, బరువు 450 టన్నులు. ఈ బుద్ధుణ్ణి జపానువారు "అమిద" అని పిలుస్తారు.





# ప్రశ్నోత్తరాలు

1. షేక్ అల్తాఫ్ హుసేన్, విజయవాడ

మేము తెలుగులో పంపించే ప్రశ్నలు తెలుగు "చందమామ"లోనే ప్రచు రించెదరా? లేక ఇతర భాష లన్నిటిలోనూ ప్రచురించెదరా?

తెలుగు "చందమామ"లో మాత్రమే.

2. జె. వి. రమణారావు, అనంతపురం

ఫోటో వ్యాఖ్యలు కార్డులో రాసి పంపమన్నారుగదా, దారిలో ఎవరన్నా చూసి కాపీచేసి మా కన్న ముందే పంపవచ్చుగదా?

పోస్టాఫీసులోనూ, మెయిల్ వాన్‌లోనూ మీ కార్డు లెవరు చదువుతారు? అటువంటి ప్రమాదానికి అవకాశం ఏమీలేదు.

3. వేరెడ్డి పెద్ద సుబ్బారెడ్డి, పొదిలెకొండపల్లి

"సైమన్" రచయితయైన సి. మాధవరావు పూర్తి ఎడ్రస్ ఏమిటండీ?

కేరాఫ్ "చందమామ," మద్రాసు - 26.

4. తిరువీధుల జగన్మోహనరావు, అద్దేపల్లి

"చందమామ"కు చక్కని గేయ కథలను పంపిస్తే వేస్తారా?

సీరియల్ గేయ కథ ఉంటున్నది గద. ఇతర గేయ కథలకు చోటుండదు.

5. ముమ్మెన హనుమంతరావు, నర్సీపట్నం

"చందమామ"కు కథలు "బుక్ పోస్టు"లో పంపినా స్వీకరిస్తారా?

స్వీకరిస్తూనే వున్నాం.

6. ఆర్. నరసింహారెడ్డి, లక్ష్మారెడ్డి, అలువాల

అన్నయ్యా, "రాకాసిలోయ" రచయిత పేరు ప్రచురించ రెందుకు?

శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం "చందమామ" సంపాదక వర్గంలోవారు.

7. తుమ్మన నారాయణమూర్తి, శ్రీకాకుళం

అన్నయ్యా, ఆ చందమామలో అందరూ కళంకము ఉన్నదంటారు. మరి ఈ "చందమామ"కు లేక పోవటానికి గల కారణమేమిటి?

అభిమానం వున్నవారికి ఏ చందమామలో కూడా ఎలాటి కళంకమూ కనబడదు.

8. పోకల పద్మలత, అనకాపల్లి

గుండు భీమన్న రచయిత ఎవరు? భేతాళ కథల ముగింపు ఎప్పుడు?

తెలియదు ; తెలియదు.

9. కుందా విశ్వనాథం, తిరువూరు

గుండు భీమన్న కథలు యింకా యెంతవరకు వేసెదరు?

ఇంకా రెండు మూడు నెలలదాకా వస్తాయి.

10. యస్. సీత, ఆత్రేయపురం

"చందమామ"లో చిన్న చిన్న సోషల్ డ్రామాలు ప్రచురించరేమి?

"చందమామ"లో డ్రామాలు ప్రచురించం.

11. అరణి రాఘవేంద్రరావు, పుదుక్కోటై

మన "చందమామ"లో అరేబియన్ నైట్స్, కాశీమజిలీలు మొదలైన సీరియల్స్ ప్రచురిస్తే బాగుంటుంది కదా?

అందుకే చాలా కథలు వాటిలోవి ప్రచురించాం!

12. మంజుల వి. కె, భద్రావతి

బొమ్మల భారతము ముగియనున్నది. రామాయణ కథ రంగులలో వస్తున్నది. భాగవతం కథ అసలు ప్రచురించుతారా, లేదా?

భారతం ముగియరావటం లేదు, ఇంకా చాలా కథ వున్నది. భాగవతం లోగడ సంగ్రహంగా వేశాం.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొంగచూపులు చూస్తారు మరి

పంపినవారు :
పి. వెంకటేశ్వరరావు - కాకినాడ

Photo by M. V. Vijayakar



బహుమతి
పొందిన వ్యాఖ్య

అందమైనది కనబడితే సరి

పంపినవారు:
పి. వెంకటేశ్వరరావు - కాకినాడ

# దయ్యం బుద్ధి

16 వందల ఏళ్ళ క్రితం సూంగ్ రాజ్యంలో వాంగ్ అనే వాడు జబ్బు చేసి చనిపోయి దయ్యమై తన ఇంటినే పట్టాడు. వాడు ఉత్త లాగు మాత్రమే తొడుక్కుని జనానికి కనిపించేవాడు. అప్పుడప్పుడూ మనిషి గొంతుతో మాట్లాడే వాడు. అందరిపైనా రాళ్ళూ, మట్టీ విసిరేవాడు.

ఈ దయ్యం కొంత కాలమయాక యూ అనే వాడి ఇంటిని పట్టి అక్కడ అల్లరి సాగించింది. చూసి చూసి యూ దయ్యంతో, "నీవు రాళ్ళూ, మట్టీ వేసి కొడితే ఫరవా లేదు. డబ్బులు తీసుకుని కొట్టకు, నీకు పుణ్యం వుంటుంది," అన్నాడు.

వెంటనే దయ్యం యూ పైన డబ్బులు విసిరి వేసింది. యూ వాటిని ఏరుకుని, "ఇవి చిన్న చిన్న నాణాలు గనక సరిపోయింది. పెద్ద పెద్ద బంగారు మొహర్లతో కొట్టితే ఏమయేది?" అన్నాడు.

ఈ మాట వినగానే దయ్యం యూను పెద్ద బంగారు మొహర్లతో కొట్ట సాగింది. ఇలా ఆరేడు సార్లు జరిగాక యూ ఆ మొహర్లను పోగు చేసుకుని ధనికుడయాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 మార్చి సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: దొంగచూపులు చూస్తారు మరి

రెండవ ఫోటో: అందమైనది కనబడితే సరి

పంపినవారు: పైడా వెంకటేశ్వరరావు,

జవహర్ వీధి, కాకినాడ.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా వాహనా లెక్కి దక్షిణంగా బయలుదేరి పాండవ శిబిరానికి సమీపంలో ఎవరికీ కనబడని చోటుగా చూసుకుని అక్కడ కొంతసేపు విశ్రమించారు. సూర్యాస్తమయం అయాక వారు ఆ చేరువనే ఉన్న కీకారణ్యం ప్రవేశించారు. ఒక వెయ్యి కొమ్మల మర్రి కింద రథాలు విప్పి, కాలకృత్యాలు తీర్చుకుని విశ్రమించారు. కృప కృత వర్మలకు త్వరలోనే నిద్రపట్టింది. అశ్వత్థామ మాత్రం క్రోధావేశంతో కన్ను మూయలేదు.

ఆ మర్రి చెట్టు మీద అనేక వేల కాకులున్నాయి. ఒక రాత్రివేళ ఒక పెద్ద గుడ్లగూబ ఎక్కడినుంచో వచ్చి, తన శత్రువులైన ఆ కాకులు నిద్రలోవుండగా వాటిపైన పడి చిత్రవధ చెయ్యటం అశ్వత్థామ కళ్లారా చూశాడు. ఆ గుడ్లగూబ తనను ఇదేవిధంగా శత్రు నిర్మూలనం చెయ్యమని హితబోధ చేస్తున్నట్టుగా అతనికి తోచింది. తాను పాండవులను ఎదిరించి పోరాడటం ఆత్మహత్యే అవుతుంది. తాను దుర్యోధనుడికి చేసిన వాగ్దానం నెరవేర్చుకోవాలంటే తన శత్రువులైన పాండవ పాంచాలురను నిద్రిస్తూవుండగానే చంపెయ్యాలి.

అశ్వత్థామ తన మేనమామ అయిన కృపాచార్యులనూ, కృతవర్మనూ లేపి వారితో తన ఆలోచన చెప్పాడు. ఈ ఆలోచనకు సిగ్గుపడి వారిద్దరూ తలలు వంచుకున్నారు. కృపాచార్యులు అతనితో, "తెల్లవారనీ, ముగ్గురమూ వెళ్లి పాండవులతో యుద్ధం చేద్దాం," అన్నాడు. "అలా కాదు. నే నిప్పుడే వెళ్లి నిద్రపోయే పాండవులనూ, పాంచాలురనూ నా కత్తితో చంపేయాలి," అన్నాడు అశ్వత్థామ.

ఇద్దరికీ కొంతసేపు చర్చజరిగింది. ఇలా చేయటం అన్యాయమన్నాడు కృపాచార్యులు. వచ్చే జన్మలో పురుగుగానైనా పుడతాను గాని, ఈ పని చెయ్యక మాననన్నాడు అశ్వత్థామ. భీష్ముణ్ణీ, తన తండ్రి అయిన ద్రోణుణ్ణీ, భూరిశ్రవుణ్ణీ, దుర్యోధనుణ్ణీ, పాండవులు న్యాయంగానే కొట్టారా అనికూడా అడిగాడు.

అతను దృఢనిశ్చయుడై తన రథాన్ని సిద్ధం చేసుకుంటూ వుండటం చూసి, కృపాచార్యులూ, కృతవర్మాకూడా కవచాలు తొడిగి, బాణాలు తీసుకుని అతని వెంట బయలు దేరారు. వారు పాండవ శిబిరాన్ని చేరేసరికి శిబిరంలో అందరూ గాఢ నిద్రలోవున్నారు.

అశ్వత్థామ మిగిలిన ఇద్దరితోనూ శిబిరద్వారం సమీపించేసరికి ద్వారానికి అడ్డంగా ఒక మహా భూతం నిలబడి వున్నది. అది పులితోలు ధరించి వున్నది. దాని శరీరం నుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. దానికి గల అసంఖ్యాకమైన చేతులలో భయంకరమైన ఆయుధాలున్నాయి. దాని శరీరాన్ని పాములు చుట్టివున్నాయి. దాని ముఖం భయంకరంగా వున్నది.

ఆ భూతాన్ని చూసి భయపడక అశ్వత్థామ దానిపై తన వద్దనున్న దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. కాని ఆ భూతం వాటి నన్నిటినీ దిగమింగింది. అతను తన వద్ద వున్న ఒక శక్తి, ఒక ఖడ్గమూ, ఒక గదా భూతంపై వేశాడు. అన్నీ వృధా అయిపోయాయి. అశ్వత్థామ నిరాయుధు డైపోయాడు. తన మేనమామ మాట విననందుకు అతను పశ్చాత్తాపపడ్డాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



"గుండమ్మ కథ"లో

కొడుకు



"గుండమ్మ కథ"లో

కోడలు

